అపరాధ పరిశోధన అనుబంధం—11

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## షాలిని
రచన: ఏ. వీ. మోహన్రావ్

## పాలెగాడు
రచన: కంచర్ల రమణ

## భూతాల బంట్లు
రచన: సుజనశ్రీ

## ప్రాణాలతో చెలగాటం?
రచన: శ్యాంబాబు

"ఖైదీ" సీరియల్ - ఆరవ భాగము

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—11**

నవంబరు, 1974

వెల: రు. 3-00

ఏడాది చందా 39 రూపాయలు

ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:

**శ్యామ దామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:

**టెంపోరావ్**

**శ్యాంబాబు**

**రమణశ్రీ**

**ఏ. వీ. మోహన్రావ్**

**సుజనశ్రీ**

**వసుంధర**

**కంచర్ల రమణ**

కార్యాలయం:

**అపరాధ పరిశోధన కార్యాలయం**

నారాయణగూడ, హైదరాబాద్-29

ఫోన్—36959

ముద్రణ:

**క్రాంతి ప్రెస్**

12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్

మద్రాసు—1

# షాలిని

## ఏ. వీ. మోహన్రావ్

ఆమెను చూడటం అదే మొదటిసారి. అందం అంటే ఏమిటో ఆమెని చూసి తెలుసుకున్నాను. నెమలి రంగు కళ్ళల్లో కామం మాత్రమే కాదు, ఎవరన్నా భయపడ నట్టుండే తెగింపుతనంకూడా కొట్టొచ్చినట్లు కనుపించాయి.

"మార్నింగ్! మిస్టర్ కరణ్" అంటూ వచ్చి కూర్చుంది ఎదురుగా వున్న కుర్చీలో.

"మార్నింగ్! మిస్..." ఆమె పేరు తెలీక ఆగి పోయాను.

"షాలిని" అంది.

"మీలాగే పేరుకూడా అందంగా వుంది" అన్నాను.

నిజమా అన్నట్లు కళ్ళెత్తి నాకేసి సూటిగా చూసి,

అంతలోనే దించుకుంది.

"ఇంతకూ మీకేం కావాలి?" అడిగాను నేనే.

"మిమ్మల్ని చూసి వచ్చిన పనికూడా మరచిపోయాను" అంటూ హ్యాండ్‌బ్యాగ్ తెరచి అందులోనుండి బంగారు వుంగరం తీసి టేబుల్ పైన పెట్టింది. దానికేసి చూశాను. నా ముందుకు తోసింది. "దీనికి మంచి ఖరీదైన వజ్రం కావాలి. దొరుకుతుందా?"

"ఎంత ఖరీదులో కావాలి!"

"లక్షదాకా ఫరవాలేదు."

"అంత ఖరీదయిన దయితే కొద్ది రోజులు ఆగాల్సి వుంటుంది. పాతిక వేలు పైన ఖరీదు చేసే వజ్రాలు ప్రస్తుతం మా దగ్గర స్టాకులో లేవు" అన్నాను.

"ఈ సిటీలోనే కాదు, ఈ దేశంలోనే, మీ షాపుకు మించిన పెద్దషాపు, మిమ్మల్ని మించిన పెద్ద డైమండ్ ఎక్స్‌పర్ట్ లేడని విన్నాను. మరి మీ దగ్గరకూడా చెత్త రాళ్ళు తప్ప మంచివి వుంటున్నట్లు లేదు" అంది షాలిని.

నా కామె మాటలకు కోపం వచ్చింది. అయినా తమాయించుకున్నాను. జవాబు చెప్పకుండా ఆమె అందమైన అవయవములకేసి చూస్తూ కూర్చున్నాను.

"మరో షాపులో ఎక్కడైనా దొరుకుతుందా?" ముందుకు వంగి గడ్డం టేబుల్ పైన ఆన్చి అడిగింది.

"దొరకదు! మాకు కూడా విదేశాల్నించి వస్తాయి. వారం రోజుల్లో స్టాకు వస్తుంది. మీఅడ్రసు రాసివ్వండి. ఉత్తరం ద్వారా తెలియపరుస్తాను" అన్నాను ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ.

"థాంక్స్! మీకు పెళ్ళయిందా?" ఉన్నట్టుండి అడిగింది.

"ఏం?" అన్నాను ఆశ్చర్యంతో.

"మీరు నన్ను చూసే తీరును చూస్తే పెళ్ళి కాలేదని ఖచ్చితంగా అనిపిస్తూంది. ఆడవాళ్ళకేసి అలా ఆరాటంగా, నమిలి మింగేటట్లు చూడటం మానుకోండి!" అంది పాలిని.

"వజ్రాలైనా, వనితలైనా, సురైనా అందాన్ని చూసి ఆనందించడమే కాదు, ఆరాధించడంకూడా నాకో పెద్ద బలహీనత" అన్నాను నా ప్రవర్తనను నేనే సర్ది చెప్పుకుంటూ.

"అన్నింటి సంగతీ నాకు తెలీదు. వనితల సంగతి మాత్రం తెలుసు. వాళ్ళకు మనసు లుంటాయి. అవి మిమ్మల్ని చూస్తుంటాయి. అదిమాత్రం మరచిపోకండి" అంది గోముగా.

"సో! యూ లైక్ మీ!" అడిగాను ధైర్యంచేసి. అదే నేను చేసిన పొరపాటు. అక్కడే నా జీవితం మలుపు తిరిగింది. అంతకు ముందుదాకా, నిండుగా నీరున్న కోనేటిలా ప్రశాంతంగా వున్న బ్రతుకులో కలతలు రేగాయి. కారుమేఘాలు క్రమ్మాయి. కారుచిచ్చులు రగిలాయి.

"ష్యూర్! కానీ లైకింగ్ ఎక్కువగా వుండాలంటే ఇంకొన్ని వివరాలు కావాలి!" అంది పకపక నవ్వుతూ.

"అడగండి! చెపుతాను."

"మీకెన్నేళ్ళు?"

"ముప్పయి ఐదు!"

"ఎంత జీతం?"

"మూడువేలు!"

"బ్యాంక్‌లో ఎంత డబ్బుంది?"

"దాదాపు ఎనభై వేలుంది. చిన్న బంగళా వుంది, మెర్సిడెస్ బెంజ్ కారుంది. బంగళాలో ఎయిర్ కండి

షన్ చేసిన బెడ్‌రూం వుంది. అందులో చిన్న బార్ కూడా వుంది" అన్నాను.

"నీకున్నవన్నీ చాలామందికి వున్నాయి. అలాంటి వాళ్ళు నావైపు కన్నెత్తి చూడటంకూడా నేను సహించను. యూ హావ్ వేస్టెడ్ మై టైమ్. వర్జాలు రాగానే ఫోన్ చేసి చెప్పు. ఇదీ నా అడ్రసు. వస్తాను" అంటూ తెల్లటి చిన్న విజిటింగ్ కార్డు నా టేబుల్ పైన పడేసి చకచక వెలుపలికి వెళ్ళిపోయింది.

అలా చూస్తూ కూర్చున్నాను అచేతనంగా, అవాక్కయి అయిదునిముషాలు.

ఆమెపైన నాకు కోపం, అసహ్యం కలిగాయి. ఈ దేశంలోవున్న బ్రహ్మచారుల్లో దాదాపు తొంభై అయిదు శాతంకన్నా మంచి పొజిషన్‌లో వున్నాను నేను. అయినా ఆమె నన్ను హేళనచేసి, చిల్లిపెంకు కొరగావన్నట్లు చెప్పి పోవడం తలచుకొంటే ఒక రకమైన పంతం రేగింది. ఎలాగైనా సరే ఆమె నోటితోనే 'ఐ లైక్ యూ!" అని చెప్పించుకోవాలి.

## 2

షాలినిని ఎంత మరచిపోవాలనుకున్నా ఆమెను గుర్తు తెచ్చుకోవడం మానలేకపోయాను. ఆమె అందమైన అవయవాలు, చిలిపినవ్వు, క్రూరమైన కామవాంఛ, నన్ను ఆమె దగ్గరకు లాగసాగాయి.

స్టాండుపైనున్న కోటుతీసి ఆమె ఇచ్చిన కార్డు వెలుపలకు లాగాను. అడ్రసు చదువుకున్నాను. ఫోన్ కూడా వుంది. ఓమారు ఫోన్ చేసి చూద్దామని ఆ కార్డు చేత్తో పట్టుకుని కార్నర్ స్టూల్ వద్దకు నడిచాను. దాన్ని చూస్తూ మెల్లగా డయల్ చేశాను.

"హల్లో!" అంటూ బొంగురు మగగొంతు వినిపించింది.

"హలో! నేను కరణ్‌ను మాట్లాడుతున్నాను" అన్నాను.

"ఎవరో నాకు తెలీదు! నీ కెవరు కావాలి?" అడిగాడు అవతలివేపు మాట్లాడుతున్న వ్యక్తి మాటలు అంటు న్నట్లుగా నవ్వరిస్తూ.

"షాలిని!" చెప్పాను.

"ముక్కుదాకా త్రాగి, వొంటిమీద స్పృహలేకుండా గదికి అడ్డంగా పడివుంది. వచ్చి చూడు కావాలంటే. నామాట అబద్ధంకాదు. విస్కీమీద వొట్టు!" అన్నాడు అతను. అప్పటికి అర్థమయింది అతను సగం త్రాగిన మత్తులో ఉన్నాడని.

"నువ్వెవరు?" అడిగాను.

"తెలీదు! కానీ అమ్మకు షాలిని నా తర్వాత పుట్టిం దట!" అన్నాడు.

విని నవ్వుకొని ఫోన్ కట్ చేశాను.

అల్మైరా తెరచి ఆఫ్ కలర్ సూట్ తీసి తెల్లషర్టు వేసు కున్నాను. ఎర్రటి వెడల్పాటి టై కట్టుకొని బూట్లు తొడుక్కున్నాను. ఖరీదైన సెంట్ పులుముకున్నాను.

బంగళాకు తాళంవేసి మెర్సిడెస్ కారెక్కాను. చేతి కున్న సీకోవాచీ గంట పదకొండయినట్లు చూపించింది. కరన్‌జ రోడ్ చేరేదాకా స్పీడుగా వెళ్లాను. రోడ్‌లోకి రాగానే స్లోచేసి ఇళ్ల నెంబర్లు చూసుకుంటూ నడిపాను.

అరవై ఆరో నెంబరు లేదు. ఆ యింటికి కాంపౌండ్ వాల్ గానీ, గేటుగానీ లేవు. రోడ్‌కు దూరంగా పాత మేడవుంది. గోడలకున్న పెచ్చులు ఊడివున్నాయి. రక రకాల పిచ్చిచెట్లు అడ్డదిడ్డంగా పెరిగివున్నాయి ఇంటి ముందు.

కారు రోడ్‌లోనే పార్కుచేసి, దిగి నడచి ఇంటివేపు

వెళ్లాను. పోర్టికోలో ఎర్ర మోటార్ సైకిల్ వుంది. వెనుక వైపునుండే చక్రం ప్రక్కనున్న పెట్టెమూత తెరచివుంది. అందులో లావుపాటి కర్ర కొట్టొచ్చినట్లు కనుపించింది.

మోటార్ సైకిల్ వెనుక నాలుగు, ముందు నాలుగు లైట్లు వున్నాయి. అవికూడా రకరకాల రంగుల అద్దాల వెనుక బిగించి వున్నాయి.

తలుపుల దగ్గరో మనిషి కళేబరం అడ్డంగా పడివుంది. నా కాలు అతని పొట్టభాగంమీద పడగానే "ఎవరది?" అన్నాడు పైకి లేవకుండానే.

"నేను!" అన్నాను.

"లోపలికిపోకు! ఈ సిటీకల్లా పెద్ద రౌడీ కిశోర్ సింగ్ లోలా నున్నాడు" అన్నాడు ప్రక్కనున్న బ్రాందీ సీసా అందుకుని నోటిదగ్గర పెట్టుకుంటూ. షాలిని అన్న వీడే అయివుంటాడని ఊహించుకున్నాను.

"అత నెందుకొచ్చాడు!" అడిగాను నేను.

"వారంవారంవచ్చి షాలినిపైన తనకున్న ప్రేమంతా వెళ్ళబోస్తాడు. అది చెప్పుతో కొట్టి పంపిస్తుంది. అంతే!" అన్నాడు. త్రాగినా అతను బాగానే మాట్లాడుతున్నందుకు నాకు ఆనందం కలిగింది.

"షాలిని అతన్ని ప్రేమించడంలేదా?"

"దానికి ప్రేమంటే తెలుసుననుకుంటున్నావా? ఐతే నువ్వు పిచ్చివాడివై ఉండాలి! తన్ను తప్ప, మరెవ్వరినీ ప్రేమించదు. డబ్బుమీద తప్ప మరో దేనిపైనా ఆమెకు మోహంలేదు! తెలుసుకో!" అన్నాడు.

అతన్ని తప్పించుకుని లోనికి అడుగుపెట్టాను. ఎదురుగుండా షాలిని అర్ధనగ్నంగా వుంది. ఆమెముందు ఆరడుగుల ఆజానుబాహువు విగ్రహం నిలబడివుంది. బాగా బలంగా ఉన్నట్లుంది అతని ఆకారం. వాళ్ళిద్దరూ ఏదో

ఘర్షణ పడుతున్నారనిపించింది. మాటలు ఆగిపోయాయి. కిశోర్‌సింగ్ షాలిని పైకి పులిలా దుమికాడు. ఆమె జుట్టు పట్టుకుని గుంజాడు. షాలిని క్రిందపడింది. ఆమె పొట్టపైన కూర్చుని మోకాలు గడ్డం క్రింద పెట్టి నొక్కసాగాడు.

నా కా సీను చూచి భయం, కోపం, ఒక్కసారిగా వచ్చాయి. ఒక్క ఊపుతో వెళ్ళాను కిశోర్‌సింగ్ వేపు. ఆమెమీదున్న సింగ్ ఎగిరి నాపైన పడ్డాడు. అతని బరువును తట్టుకోలేక నేను క్రిందపడిపోయాను.

"స్కౌండ్రల్! అందరిలాంటి ఆడదననుకున్నావా? పైన చెయ్యివేశావంటే చంపుతాను" అంది అప్పుడే లేచి నిలబడ్డ షాలిని.

సింగు నాకేసి చూశాడు. నేనెవ్వరో అతనికి అర్థం కాలేదు. నన్నూ, షాలినిని, మార్చిమార్చిచూసి, నన్ను చావగొట్టడం మొదలెట్టాడు. షాలినివచ్చి సింగును తోసివేసింది. అప్పటికే నావళ్ళు హూనమయింది. నోటిగుండా చొంగ కారింది. వెల్లకింతలాపడిపోయాను. స్పృహకూడా పోయింది.

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి గోధుమరంగు చీర జాకెట్‌లో ఉన్న షాలిని గ్లాసులో నీళ్ళు అందిస్తూ కనుపించింది.

"నేనెక్కడున్నాను?" అడిగాను భయంగా.

"ఇక్కడే ఉన్నారు. ఈ నీళ్ళు త్రాగండి!" అంది.

లేచి కూర్చుని గ్లాసుడునీళ్ళు గడగడ త్రాగేశాను.

"వాడేమయినాడు?" చుట్టూ చూశాను.

"తన్ని తరిమేశాను. అయినా ఏం మగాడివి! అతను అలా తంతూంటే బిక్కురుమనకుండా వేడివేడి పకోడీలు తిన్నట్టుగా తిన్నావ్?" అంది షాలిని నవ్వుతూ. ఆమె సన్నటి తెల్లటి పళ్ళవరస కనుపించింది. ఆ నవ్వే నా ప్రాణాలు తీసింది, నన్ను పిచ్చివాడ్ని చేసింది.

"అతన్ని నేను ఎదుర్కోగలనన్న ధైర్యం లేక పోయింది!" అన్నాను సిగ్గుతో తలవంచుకుంటూ.

"నాన్సెన్స్! ఆడదాన్ని! నేను హాండిల్ చెయ్యగా నువ్వు చెయ్యలేవా? అసలింతకూ నా ఇంటికి నువ్వెందు కొచ్చినట్లు" అడిగింది షాలిని.

"నిన్ను చూడాలనిపించింది వచ్చేశాను" అన్నాను మెల్లగా.

"కిశోర్ సింగ్ ను తెలుసా?" అడిగింది షాలిని.

"తెలీదు. మీ త్రాగుబోతు అన్నయ్య చెపితే విన్నాను. ఈ వూళ్ళోకల్లా పెద్ద రౌడీ అట!"

"అట కాదు! నిజం. ఇప్పటికి నాలుగైదు హత్యలు చేశాడని వినికిడి. వాడు నన్ను ప్రేమిస్తున్నాడు. వాడి కున్నపాటి ధైర్యం, తెగింపు, సాహసం కూడా లేవు నీకు. నిన్నెలా ప్రేమించేది" అడిగింది.

"అలాంటి వాళ్ళంటే నీకు ఇష్టమా!"

"లేదు! అంతకన్నా ఇంకా పెద్ద రౌడీయో, దొంగో, హంతకుడో అయితే తప్ప ఇష్టపడను" అంది షాలిని.

"ప్రెచురస్! అదేం విపరీతపు కోరిక నీకు?" అయోమయంగా చూస్తూ అడిగాను.

"కోరిక కాదు! టేస్ట్! నువ్వు పనికిరావని తెలిసిందిగా. వెళ్ళు" అంది.

నాకు అనుమానం వేసింది. జీవితంలో ప్రేమంటూ పుట్టింది షాలినిపైనే నాకు. ఆమెను ఎలాగైనా పొందా లన్న తపన ఎప్పుడో కలిగింది. నిర్ణయం చేసుకున్నాక సాధించకపోవడం అనేది నేనెరుగను. నాది మంకుపట్టు.

"వెళ్ళను!" అన్నాను.

"ఏం చేస్తావ్?"

"నన్ను పెళ్ళాడేందుకు నీచేత ఒప్పిస్తాను. మనిషిలో

అలాంటి రాక్షసప్రవృత్తి కావాలని నువ్వెందుకు కోరుకుంటావ్?"

"ఇది కలికాలం. మనుషుల్ని బ్రతకనివ్వరు. రాక్షసులు బ్రతకగలరు. ఆనందించగలరు. అందుకే రాక్షస కృత్యాలన్నా, రాక్షసులన్నా నాకు చాలా ఇష్టం."

"అయితే నీకోసం నేనూ రాక్షసుణ్ణవుతాను" అన్నాను రక్కున.

"నీ చేత కాదు!"

"అలాగనకు! నా తడాఖా చూపిస్తాను. ఆ తర్వాత నువ్వే అంటావ్ నీ అంత రాక్షసుడు నువ్వు తప్ప మరొకరు లేరని."

"చూద్దాం! ముందు నీ ప్రతాపం చూపించు" అంది నవ్వుతూ.

నేను లేచి గబగబ బట్టలు వేసుకొని వచ్చేశాను.

మరుసటి దినం ఎక్కడికీ పోకుండా ఇంట్లోనే విస్కీ త్రాగుతూ కూర్చున్నాను. నా రాక్షసకృత్యాల్ని ఎలా చెయ్యాలి. ఏం చేస్తే షాలిని నన్ను మెచ్చుకుంటుంది? రకరకాల ఆలోచనలు వస్తున్నాయి. పోతున్నాయి, ఏదీ తేల్చుకోలేక పోయాను.

కిశోర్ సింగ్ గుర్తొచ్చాడు. వాడు నన్ను షాలినిముందు చావబాదాడు. పైగా ప్రేమలో నాకు ప్రత్యర్థి. అన్నింటినీ మించి వాడు పెద్ద రౌడీ, హంతకుడు. వాణ్ణి ఏడిపిస్తే, నన్ను వాణ్ణిమించిన రాక్షసుడిగా షాలిని గుర్తిసుంది. అందుకేం మార్గం వుందాని ఆలోచించాను. మెరుపులా మెరసింది ఐడియా.

## 3

రాత్రి పన్నెండయింది.

నల్లటి సూట్ వేసుకున్నాను. ఫెల్ట్ హాట్ పెట్టు

కున్నాను. గారేజీలోంచి ఐదులీటర్ల పెట్రోలు టిన్నుతీసి, సైఫను సాయంతో, కారుటాంకులోని పెట్రోలు దాన్నిండా నింపాను. టిన్ను తెచ్చి ముందుసీట్లో పెట్టుకొని, కారు స్టార్టుచేశాను.

కర్జన్ రోడ్ మొదట్లోవున్న మూడంతస్తుల పాత భవనం, కిశోర్ సింగ్ నివాసమని ఆ సాయంత్రమే తెలుసుకున్నాను. ఒక్కొక్క ఏరియాకు ఒక్కొక్క రౌడీ వుంటాడు. రోజూ రాత్రి పన్నెండు గంటలకు అంతా కిశోర్ సింగ్ దగ్గరకు వస్తారని తెలుసుకున్నాను. తమ నాయకుడికి ఇవ్వవలసిన వాటా మొత్తం ఇచ్చి, కాసేపు త్రాగి, పేకాడి, వేకువఝామున వెళ్ళిపోతూండడం రివాజనికూడా కనుక్కున్నాను.

కారును కర్జన్ రోడ్‌కు ముందుగానే ఆపేశాను. లాక్ చేశాను. పెట్రోలు టిన్ను చేత్తోపట్టుకుని పేవ్ మెంట్ మీద చెట్లనీడల్లోపడి ఎవరికీ కనుపించకుండా నడచిపోయాను.

దూరంనుంచే కిశోర్ సింగ్ ఇంటికేసి చూశాను. వరుసగా ఎర్రటి మోటార్ సైకిల్స్ ఒకదానిప్రక్క నొకటి పార్క్ చేసి వున్నాయి. అడుగులో అడుగువేసుకుంటూ వెళ్లాను. ఎవరూ జనం తిరగటంలేదు. డబ్బామూత తీశాను. అన్నింటిమీద పెట్రోలు చిలకరించాను. అప్పుడే వాటిని లెఖపెట్టాను. మొత్తం ఇరవై రెండున్నాయి. డబ్బా కూడా ఒక సైకిల్ పైన పెట్టాను.

సిగరెట్ వెలిగించుకొని లయిటర్ ఆర్పి జేబులో వేసుకున్నాను. కాలుతున్న సిగరెట్ దూరంనుండి వడిసెల్లో రాయిలా మధ్య వేలుకు, చూపుడువేలుకు నడుమ ఇరికించి బలంగా విసిరాను. వెళ్ళి మోటారుసైకిళ్ళపైన పడగానే గుప్పున ఆకాశమెత్తున మంటలేచింది.

"మంటలు! మంటలు!" అంటూ అందరూ పరుగెత్తు కుని రావడం మొదలెట్టారు. వాళ్ళమధ్యనుండి నేను మెల్ల కువగా తప్పించుకుని వచ్చేశాను కారు దగ్గరకు. ఎక్కి కూర్చున్నాను. స్టార్టు చేసి ఐదునిముషాల్లో ఐదు కిలోమీటర్లు దాటాను.

పబ్లిక్ బూత్ నుండి ఫైర్ సర్వీసుకు ఫోన్ చేసి ఆక్సి డెంటు గురించి చెప్పి వెంటనే హెల్ప్ పంపమన్నాను. నా పేరడిగారు. చెప్పకుండానే లైను కట్ చేసి, తిన్నగా బంగళాకు వెళ్ళిపోయాను.

కారు గారేజీలో పెట్టి తాళం వేసుకుని, బంగళా తాళంతీసి లోనికెళ్ళి కాళ్ళూ చేతులూ శుభ్రంగా కడు క్కొని వచ్చి మంచంమీద పడుకున్నాను.

నా జీవితంలో ఎప్పుడూ చిన్న నేరం చెయ్యలేదు. అలాంటిది ఇంత పెద్ద ఘోరం ఒంటరిగా, ధైర్యంగా, చేసి వచ్చాను. తలచుకొని భుజాలు పొంగిపోయాయి. కిశోర్ సింగ్, వాడి అనుచరులు ఎటూ కదలకుండా చేసినందుకు ఆనందం కలిగింది. నాలో మంచిమనిషి చచ్చాడనీ, రాక్ష సుడు అవతరించాడనీ నా కప్పటికి అర్థంగాలేదు.

గంట తర్వాత ఫోన్ మ్రోగింది.

రిసీవరెత్తి "హల్లో! కరణ్ హియర్! ఎవరు?" అడి గాను.

"షాలిని!" అంది అవతలివైపు నుండి.

"నువ్వా? ఏమిటి?"

"నీ అంత నీచుణ్ణి ఇంతకుముందెప్పుడూ చూడలేదు!" అంది.

"ఎందుకలా అంటున్నావ్?"

"కిశోర్ సింగ్ ఇంటిముందు జరిగిన ఘోరం నువ్వే కదూ చేసింది!"

"గుడ్! బాగానే గెస్ చేశావ్! అవును నేనే!"

"అలాంటి చాటుదెబ్బలు తీసే మనుషులంటే నా కసహ్యం. ధైర్యంవుంటే ఎదురుగా పోరాడు. గెలువు. మెచ్చుకుంటాను" అంది షాలిని.

"నాన్సెన్స్! రాక్షసులు ఎదుటపడి పోరాడరు. ఎలా పోరాడా డన్నదికాదు ముఖ్యం! పోరాటం యొక్క ఫలితం!" అన్నాను.

"నీ సంగతి కిశోర్‌సింగ్‌కు తెలిస్తే ఏం చేస్తాడో తెలుసా?"

"భయపెడుతున్నావా? సారీ! నేను భయపడను. నిన్ను ప్రేమించకముందు, నువ్వు నాకు కావాలని కోరుకోకముందు, సొసైటీలో స్టేటస్ కోసం, మంచివాడిననిపించుకొనేందు కోసం, అయిష్టంగా వున్నా, మంచిగా ప్రవర్తించే వాణ్ణి. ఇప్పుడా పద్ధతి మానేశాను. కిశోర్‌కు చెప్పిచూడు. ఏమవుతుందో చూద్దుగానీ!" అంటూ ఫోన్ కట్ చేసి క్రింద పడేశాను.

# 4

నాలుగు గంటల ప్రాంతంలో కారు ఏదోవచ్చి బంగళా ముందాగిన శబ్దమయింది. నాకు తెలుసు వచ్చిందెవరో? నేను క్రింద హాల్లో విండో కర్టెను వెనుక నక్కి దాక్కున్నాను. తలుపుతట్టి పిలుస్తారని ఎదురుచూశాను. ఎవ్వరూ తట్టలేదు. నేను పడకగదిలో వున్నాననుకుని డ్రెయిన్ వాటర్ పైపు సాయంతో పైకెక్కి, బెడ్‌రూం కిటికీగుండా లోపలకు దూరుతారని ఊహించాను. వెళ్ళి పైకి వెళ్ళేందుకు వున్న మెట్ల మొదట్లో నిలబడ్డాను చేతిలో మెషిన్ గన్ పట్టుకుని.

బెడ్‌రూంలోంచి తుపాకీ గుండ్లు పేలిన చప్పుడయింది. మనిషిలా దిండ్లను తయారుచేసి మంచానికి అడ్డంగా

పెట్టె పైన దుప్పటికప్పి వచ్చాను. నేనే వున్నాననుకుని వాళ్ళు కాల్చివుండాలనిపించింది.

"మోసం మోసం!" అంటూ పైనుండి కేకలు వినిపించాయి.

నేను గన్ గురిపెట్టి స్టడీగా నిలుచున్నాను. పైవేపు మెట్లు మొదట్లోకి కిశోర్‌సింగ్ వచ్చాడు. అతని వెనుక ఇద్దరు అనుచరులున్నారు.

"సుస్వాగతం! రండి! దిగిరండి!" అన్నాను వాళ్ళకే గురిపెట్టి.

గుడ్లు తేలవేశారు ముగ్గురూ.

"ముందు మీ దగ్గరున్న ఆయుధాలు క్రిందకు విసిరి వెయ్యండి. క్విక్. లేకుంటే కాకుల్ని కాల్చినట్లు కాల్చి చంపుతాను" అన్నాను.

అందరూ బిక్కచచ్చిపోయారు. గన్స్ క్రిందకు విసిరారు. కిశోర్ గురిచూసి నా చేతిలోవున్న గన్‌కేసి కొట్టబోయాడు. నేను తప్పించి, అతని కాలి మడమలో తగిలేట్లుగా గుండు పేల్చాను. కక్కున క్రిందపడ్డాడు. అతని అనుచరులిద్దరూ అలాగే చేతులు పైకెత్తుకుని రాతి బొమ్మల్లా నిలబడ్డారు.

మెల్లగా ఒక్కొక్క మెట్టే పైకెక్కాను. పొడవుపాటి నూలుత్రాడు వాళ్ళపైకి విసిరాను. కిశోర్ కాళ్ళు చేతులు కట్టమన్నాను. అలాగే చెప్పినట్లు చేశారు. మిగిలిన ఇద్దర్నీ గోడవేపు మొహాలుపెట్టి, ఆనుకుని నిలుచోమని అరచాను. చెప్పినట్లు చేశారు. వాళ్ళ కాళ్ళు, చేతులు ఇంకో త్రాడుతో కట్టేశాను.

ముగ్గుర్ని క్రిందకు లాక్కొచ్చి కార్లో బ్యాక్‌సీట్‌లో త్రోసి, షాలిని ఇంటివేపు పోనిచ్చాను. అరగంటలో ఆమె ఇంటిముందుకు వెళ్ళి ఆగింది కారు. తలుపు బూటుకాలితో

తన్నాను.

తెరుచుకున్నాయి తలుపులు. ఆమె అన్నగారు "ఎవరు?" అని అడిగాడు.

"కరణ్! షాలినేది?" అడిగాను.

"పిలుస్తాను. కానీ నా లంచం ఏదీ!" అన్నాడు.

కోటుజేబులోంచి క్వార్టర్ బాటిల్ బ్రాందీ ఇచ్చాను. అందుకొని, ఆనందంగా ఈల వేసుకుంటూ వెళ్ళాడు. రెండు నిముషాల తర్వాత షాలిని వచ్చింది. నన్ను చూసి ఆశ్చర్యపోయింది.

"నువ్వా?" అంది.

"ఏం? ఈపాటికి ఆ సింగ్ గాడు నన్ను యమలోకం పంపి వుంటాడనుకున్నావా?" అడిగాను కోపంగా.

"కాదు?" అంది తలవంచుకొని.

"బుకాయించకు. నువ్వే వాళ్ళకు నా గురించి చెప్పావ్. వాళ్ళని తీసుకొచ్చాను. చూద్దువుగాని రా?" అంటూ రెక్క పట్టుకొని బడబడ వెలుపలకు ఈడ్చుకు వెళ్ళాను. బాక్ డోర్ తెరచి, ముగ్గుర్నీ బయటకులాగాను. వాళ్ళు జారి క్రిందపడ్డారు.

"నువ్వొక్కడివేనా ఈ ఘనకార్యం చేసింది?" అడిగింది షాలిని.

"అవును! కావాలంటే వాళ్లనే అడుగు" అన్నాను గర్వంగా.

వాళ్ల కట్లిప్పి తరిమేసింది షాలిని. పిక్కలబలం చూపించారు. నవ్వుకున్నాను. "లోపలకి వెళ్దాం!" అంది షాలిని.

నాకు ఆకాశంలో అందకుండా గాలికి పరుగెత్తికొనిపోయే తెల్లమబ్బుపైన ఎక్కి కూర్చున్నట్లుగావుంది ఆమె పిలుపు. వెంట వెళ్ళాను.

రెండుగ్లాసుల్లో విస్కీపోసి "ఫార్ అవర్ లవ్!

ఛీర్స్!" అంటూ గ్లాసులు ఠంగుమని మ్రోగించి నాకో గ్లాసిచ్చింది. ఇద్దరం మెల్లగా త్రాగసాగాం. సిగరెట్ ముట్టించుకున్నాను.

"ఐ లవ్ యూ! కానీ నిన్ను లైక్ చెయ్యలేకపోతున్నాను" అంది షాలిని.

"ఎందుకని?" అడిగాను.

"నీదగ్గర డబ్బులేదు! ముందది సంపాదించే సులభమైన మార్గం చూడాలి. నాకు చాలీచాలని జీవితమంటే అయిష్టం" అంది.

"దాదాపు లక్షరూపాయలున్నాయి. ముందే చెప్పాను" అన్నాను.

"అదేమూలకు. మనిద్దరం కాశ్మీర్ కు హనీమూన్ కు వెళ్ళేందుకూడా చాలదు" అంది షాలిని.

ఆమె మాటల్లోని నిజం నాకర్థమయింది. నా జీవితంలో ఖర్చులు జాగ్రత్తగా పెట్టుకొంటూ, పొదుపు చేసి మిగిల్చిన మొత్తమది. కానీ పట్టుమని పదినాళ్ళ హనీమూన్ ట్రిప్ కు అది చాలేట్టులేదు.

"నువ్వు చెప్పింది కరెక్ట్! కాస్త టైమివ్వు. ఏదైనా పథకం ఆలోచిస్తాను" అన్నాను. "నో అర్జెన్సీ! నిదానంగానే జరగనీ. ఈ క్షణంనుండి నేను నీదాన్ని. ఆవిషయం మరచిపోకు. కానీ నన్ను నీవు అనుభవించేమాత్రం హనీమూన్ లోనే! అదీ గుర్తించుకో!" అంది షాలిని.

ఆనందం పొంగులెత్తింది. ఆకాశం చెంగున దుమికింది గుండెల్లో. ఆమెను నా బాహుబంధంలో ఘట్టిగా అదుముకున్నాను. ఆమె ఎత్తులు, పల్లాలు, అవయవాలసొంపులు, సోయగాలు నా శరీరంలోని ప్రతి అణువుకూ తగిలాయి. బ్రాందీని మించిన మత్తు పుట్టుకొచ్చింది నాకు. ఆమె

మెల్లగా నా కౌగిలి వదలించుకొని దూరంగా పోయింది. నేను వెలుపలికొచ్చి కారెక్కి బంగళాకు దారితీసాను.

# 5

ఆ తర్వాత మూడ్రోజులు డబ్బు సులభంగా సంపాదించే మార్గమేమన్నా ఉంటుందాని ఆలోచించడంతోనే సరిపోయింది. రెండుసార్లు షాలిని ఫోన్ చేసింది. నేను మూడుసార్లు ఫోన్‌లో ఆమెతో మాట్లాడాను. ఆఫీస్‌కు లీవ్ పెట్టి ఇంట్లోనే ఉన్నాను.

కిశోర్ సింగ్ చేతిలో చావుదెబ్బలుతిన్న పెద్ద పెద్ద రౌడీలు నలుగురైదుగురు వచ్చారు. కలుసుకుని నేను చేసిన ఘనకార్యానికి మెచ్చుకున్నారు. వాళ్లను వదిలించుకోవడం పెద్దసమస్యాయిపోయింది నాకు.

ఎన్ని ఆలోచనలు చేసినా, డబ్బు సులభంగా దొరికే మార్గం కనుపించడంలేదు నాకు. అదిలేనిదే షాలిని నాకు దక్కదు.

ఐదోరోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఫోన్ మ్రోగింది. బహుశా షాలినయి వుండవచ్చుననుకుంటూ రిసీవరెత్తాను.

"హల్లో! కరణ్ స్పీకింగ్!" అన్నాను.

"హౌ ఆర్ యూ! నేను ఖాన్‌ను మాట్లాడుతున్నా" అన్నాడు బాస్.

"బాగున్నాను సార్!" అన్నాను.

"బాగా రెస్ట్ తీసుకున్నావా?"

"అc!"

"ఈదినం కొద్దిగా పనుంది. అవసరంగా ఒకమారు వచ్చి పోగలవా?"

"మధ్యాహ్నం వస్తాను" అన్నాను.

"థాంక్స్! మూడింటికిరా చాలు!" అన్నాడు ఖాన్.

"అలాగే!" అని ఫోన్ కట్ చేశాను.

నా మనస్సునిండా షాలినే నిండుకుంది. అంతకుముందే నేను చాలామంది ఆడవాళ్లను చూశాను. కానీ ఎవ్వరూ నన్నిలా మత్తెక్కించలేదు.

మధ్యాహ్నం మూడింటికల్లా ఆఫీసులో అడుగుపెట్టాను. తిన్నగా వెళ్ళి ఖాన్ గారి గదిలో ఆయనముందు కూర్చున్నాను.

"వస్తానన్న టయిమ్‌కు వచ్చావ్! థాంక్స్!" అన్నాడు ఖాన్.

"దటీజ్ డ్యూటీ! ఇంతకూ ఏమైనా అర్జెంట్ సేల్ వుందా?" అడిగాను.

"సేల్ కాదు! పర్చేజ్. మహారాణి సావిత్రీదేవి గుర్తుందా నీకు" అడిగాడు ఖాన్.

"ఓ!! ఆమెనెలా మరచిపోతాను. మనం కంపెనీ పెట్టాక చేసిన పెద్ద అమ్మకం ఆమెదేగా. ఆమెకు కావలసిన వజ్రాలకోసం ముప్ఫయి దేశాలుకూడా తిరిగొచ్చానుగా."

"ఆవిడ నిన్న వచ్చింది. మనం ఆవిడకు అమ్మిన వజ్రాల నెక్లెసు వెంటనే ఎవరికన్నా అమ్మిపెట్టమంది. ఎవ్వరికీ తను అమ్మిన విషయం—ముఖ్యంగా తన భర్తకి తెలియకూడదని చెప్పింది."

"ఎందుకని."

"రేసుల్లో, పేకాటలో, తాగుడు పార్టీలలో గత రెండేళ్ళలో ఆమెకు చాలా లక్షలు అప్పయిందని నేను విన్నాను. ఆ డబ్బంతా విపరీతమైన వడ్డీలకు తెచ్చింది. అవన్నీ పాపంలా పెరిగాయి. అప్పులిచ్చినవాళ్ళు వెంటనే డబ్బిమ్మని, లేకుంటే ఆమె భర్తకు చెప్తామని బెదరిస్తున్నారట. దాంతో ఆమె భయపడిపోయింది. నా దగ్గర

కొచ్చింది. ఎలాగైనా అమ్మిపెట్టమని చెప్పింది. ఈ దినం రాత్రిలోగా డబ్బు కావాలంది. వీలులేదన్నాను. కనీసం రేపు సాయంత్రంలోగానన్నా డబ్బిమ్మని అడిగింది. నీతో ఆలోచించి ఫోన్ చేస్తానని చెప్పాను" అన్నాడు ఖాన్.

ఆ నెక్లెసును అప్పట్లో ముప్ఫయి లక్షల రూపాయలు పెట్టి కొనింది. నేను దేశాలు తిరిగిన ఖర్చులన్నీ ఆవిడే భరించింది. అంత ఖరీదైన నెక్లెసు కొనేవాళ్ళు ఎప్పుడు పడితే అప్పుడు దొరకరు. ఆ నెక్లెస్ విలువ గుర్తురాగానే నా మెదడు పనిచెయ్యడం ప్రారంభించింది. చకచక ప్లానింగ్ జరిగిపోయింది నాలో. పాలిని గుర్తుకొచ్చింది. ఆమె మాటలు చెవుల్లో గింగురుమన్నాయి.

"దాన్ని అమ్మడం మాటలుకాదు. చాలా టయిమ్ పడుతుంది. అంతడబ్బు పెట్టికొనే మనిషికావాలి ముందు" అన్నాను.

"అవును. నువ్వే ఏదైనా మార్గం చెప్పు. ఆమె గంటకో మారు ఫోన్ చేసి నా ప్రాణాలు తోడేస్తోంది" అన్నాడు ఖాన్.

"ఆమెకు డబ్బు అవసరంగా ఉందంటున్నారు. మీరే ఎందుకు కొనగూడదు. సగంకన్నా తక్కువ ధరకు కొనవచ్చు. మనం దాన్ని విడగొట్టి వేరువేరు డిజైన్లలో ఒక సెట్ చేసి అమ్మితే నలభైలక్షలదాకా మిగులుతుంది. అంటే ముప్ఫయిలక్షలు ఆదాయం వస్తుంది. ఇంతకన్నా మంచి ఛాన్సు మనకు దొరకదు" అన్నాను.

ఖాన్ ఆలోచనలో పడ్డాడు.

"నువ్వు చెప్పేది బాగానేవుంది. కానీ అంతడబ్బు కంపెనీద్వారా పెడితే ఇన్‌కంటాక్సు వాళ్ళు నెత్తికెక్కుతారు. మనకు మిగిలేదేముంటుంది?" అడిగాడు ఖాన్.

"అందుకే మీ స్వంతడబ్బుతో కొనండి. ఏ గొడవా

వుండదు" అన్నాను.

"ఆమె అంత సులభంగా అమ్ముతుందా?"

"ఆ సంగతి నాకు వదిలెయ్యండి. నేను వ్యవహారం చక్కబరుస్తాను."

"అయితే ఏడులక్షలకు సెటిల్ చెయ్యి. మళ్ళీ ఆమె ఇక్కడికొచ్చి ఏడవకుండా చూడు. నే నీలోగా డబ్బు ఏర్పాటు చేస్తాను. కానీ వీలయినంత త్వరలో తిరిగి అమ్మేసి మనం డబ్బు చేసుకోవాలి. వచ్చే ఆదాయంలో రెండుశాతం నీకు ఇస్తాను కమీషన్ గా" అన్నాడు ఖాన్.

"అలాగే!" అంటూ తలూపి వెలుపలికి వచ్చాను. కారెక్కాను. నా ప్లాను ప్రకారం దాదాపు ఇరవైలక్షలు లాభంవస్తాయి ఖాన్ కు. అందులో నాకు అతను ఇరవై వేలు ఇస్తానన్నాడు. కష్టం నాది. ఫలితం అతనిది. ఇలాగే నా తెలివిని అడ్డంగా పెట్టుకుని దోచుకొని లక్షలుకాదు కోట్లు ప్రోగుచేశాడు. ఈ దోపిడీని ఇంక జరుగనివ్వ దలచుకోలేదు.

బంగళానుండి మహారాణి సావిత్రీదేవికి ఫోన్ చేశాను.

కింగ్స్ గోల్ఫ్ క్లబ్ కు సాయంత్రం ఆరు గంటలకు రమ్మందామె. ఆమె చెప్పినట్లే సరిగ్గా ఆరింటికల్లా అక్కడున్నాను. నన్ను చూడగానే దగ్గరకొచ్చింది.

"అలా వెళ్దాం!" అంటూ దూరంగా చెట్లకేసి చూపించింది.

పచ్చికలో ఫర్లాంగుదూరం నడచి చెట్లక్రిందకు వెళ్ళాం.

"ఖాన్ నిన్ను పంపాడా?" అడిగింది సావిత్రీదేవి.

"ఆఁ!"

"అంతా చెప్పాడా?"

"చెప్పాడు."

"ఏదైనా పార్టీ వుందా?"

"లేదు! ఏవిధమైన ప్రచారం లేకుండా దాన్ని అమ్మడం అసాధ్యం. అంత ఖరీదైన వస్తువు కొనేందుకు డబ్బు సిద్ధంగా వున్నవాళ్ళు లేరు. కానీ నాకు తెలిసిన స్మగ్లర్ ఒకతను వున్నాడు. అతను కొంటాడు. కానీ మీరు పెట్టిన పెట్టుబడికూడా రాదు" అన్నాను.

"ఎంతకు కొంటాడు?"

"అతనితో మాట్లాడి వచ్చాను. ఆ నెక్లెసు గురించి అతనికి తెలుసట. అంత పెద్ద వస్తువులతో ఎప్పుడూ వ్యాపారం చెయ్యలేదన్నాడు. పదిలక్షలకుమించి ఒక్క పైసాకూడా ఇవ్వలేనన్నాడు."

"ఇది అమ్మకంకాదు. దోపిడి!"

"అందుకే నాకు ఇష్టంలేదని చెప్పాను. ఆ విషయం చెప్పిపోదామని వచ్చాను."

"ఖాన్‌తో చెప్పావా?"

"చెప్పాను."

"అతనేమన్నాడు?"

"నాతో ఏకీభవించాడు!"

"ఇది మోసం. ఆరోజు కొనేటప్పుడు ఎప్పుడు కావాలంటే అప్పుడు అమ్మవచ్చునన్నారు. ఐదారు లక్షల లాభంకూడా వస్తుందన్నారు. ఇప్పుడిలా మాట్లాడుతున్నారు" అంది విసుక్కుంటూ.

"మోసంలేదు మేడమ్! ఇప్పుడైనా మీరు బాహాటంగా అమ్మగలిగితే చెప్పండి, దేశమంతా తిరిగి ఎవరినన్నా పడతాను" అన్నాను.

"నో! దటీజ్ ఇంపాజిబుల్. ఈ విషయం నా భర్తకు తెలిస్తే కాల్చి చంపేస్తాడు."

"తర్వాతయినా తెలుస్తుందిగా! అప్పుడుమాత్రం చంపకుండా వదిలేస్తాడా?"

“నా దగ్గరే వుందని చెప్తాను. చూపించమని అడిగే ప్రసక్తేలేదు” అంది సావిత్రీదేవి.

“ఇలా ఎవ్వరికీ తెలీకుండా అమ్మాలంటే నేను చెప్పిన దానికన్నా ఎక్కువ డబ్బురాదు. అతను ఎనిమిది లక్షలకు పైన ఇవ్వనన్నాడు. నేనే అతన్ని బ్రతిమాలి ఒప్పించాను” అన్నాను.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

“నేను ఎలాంటి పరిస్థితుల్లో చిక్కుకున్నానో తెలుసుకుని లూట్ చేస్తున్నారు. కానివ్వండి. డబ్బు ఈ రాత్రికి కావాలి!” అడిగింది.

“మీరు నెక్లెసు ఈ రాత్రికి ఇవ్వగలరా?”

“ఆఁ!”

“అయితే ఎక్కడ కలుసుకుందాం!”

“కాసినో సినిమాకు రా! సెకండ్ షోకే వస్తాను. అక్కడే వ్యవహారం సెటిల్ చేసుకుందాం!” అంది సావిత్రీదేవి.

“అలాగే! వస్తాను” అన్నాను.

“మిస్టర్ కరణ్! నాదగ్గరున్న నెక్లెసు తయారుచేసే ముందు అలాంటిదే గాజుతో డిజైన్ చేసిన మరో నెక్లెసు చూపించావు గుర్తుందా?” అడిగింది సావిత్రీదేవి.

“గుర్తుంది!”

“నాకది కావాలి! దాని ఖరీదు తగ్గించుకొని మిగిలిన డబ్బివ్వు!” అంది.

దాన్నామె గుర్తుచేశాకే నా ప్లాను మార్చుకున్నాను.

“సారీ! మేడమ్! దాన్ని అప్పుడే స్పాయిల్ చేశాం. మీ దగ్గరున్నది మరొకరి దగ్గర వుండగూడదని అలా చేశాం!” అన్నాను.

“ఆల్ రైట్! కాసినోలో సెకండ్ షోకు రా!” అంది.

నేను ఆమెవద్ద శెలవు తీసుకొని తిరిగి వచ్చేశాను. తిన్నగా ఇంటికి వెళ్ళి నా అల్మైరా తెరచి అందులోని సీక్రెట్ డ్రాయరు లాగిచూశాను. అందులో నకిలీ నెక్లెసు కనుపించింది. తీసి పైకెత్తి లైటువెలుగులో చూశాను. అది నకిలీదని గుర్తుపట్టడం చాలాకష్టం. తిరిగి దాన్ని సీక్రెట్ డ్రాయరులోవేసి తాళంవేశాను.

ఖాన్ ఇంటికి ఫోన్ చేశాను, వస్తున్నానని చెప్పేందుకు.

డ్రెస్ మార్చుకుని తిన్నగా ఖాన్ బంగళాకు వెళ్ళాను. అది చిన్న బంగళా. రోడ్ పైనే వుంటుంది. ఖాన్ కు పెళ్లి పెటాకులు లేవు. అందమైన అమ్మాయిల్ని అప్పటికప్పుడు కొనుక్కోవడం సరదా. ఇంట్లో ఒకేఒక సర్వెంట్ వున్నాడు. ఇంటిపని, వంటపని మొత్తం అతనే చూస్తాడు. నన్నతనికి బాగా తెలుసు.

నే వెళ్లేసరికి హాల్లో పచార్లు చేస్తున్నాడు ఖాన్.

ఇద్దరం కూర్చున్నాం.

సర్వెంట్ విస్కీ తెచ్చి ఇచ్చాడు.

గ్రాగేందుకు నోటిదగ్గర పెట్టుకున్నాను.

“ఏమయింది? వెళ్ళినపని” అడిగాడు ఖాన్.

“అతికష్టంమైన పదిలక్షలకు ఒప్పించాను. రాత్రికి డబ్బిమ్మంది. మీరు రెండింటి లోపల డబ్బు సిధ్దం చెయ్యాలి” అన్నాను.

“సిదంచేసేవుంచాను. కానీ ధర కాస్త తగ్గించవలసింది” అన్నాడు. అతని మాటలకు నాకు వొళ్ళుమండింది. ఆమెను పట్టపగలు నిలువు దోపిడీ చెయ్యడంగాక, ఇంకా ధర తగ్గించనందుకు నన్ను అతను తప్పు పట్టడం తలచుకొని వొళ్ళుమండింది. నాలుగూ అడిగి అక్కడే కడిగి పారేద్దామని అనుకున్నాను. అయినా తమాయించు

కున్నాను.

లోనికివెళ్ళి చిన్న బ్రాండ్ కేస్ తెచ్చాడు. దాన్నిండా వెయ్యిరూపాయల నోట్లున్నాయి. అన్నీ కొత్తవే.

"మొత్తం పదిలక్షలు! డబ్బిచ్చేదాకా ధర తగ్గించేందుకు అవకాశం వుందిగా. ప్రయత్నించిచూడు" అన్నాడు మళ్ళీ ఖాన్.

"అలాగే!" అన్నాను.

"నెక్లెస్ తీసుకుని తిన్నగా ఇక్కడికొచ్చెయ్యి. నాపేరుమీదే రశీదు తీసుకో" అన్నాడు ఖాన్.

"అలాగే!" అన్నాను బ్రాండ్ కేస్ తీసుకొని లేచి నిలుచుంటూ.

# 6

పన్నెండూ పదిహేనుకు కారెక్కి స్టార్టుచేశాను. గేటు దాటబోయేంతలో ఎదురుగా పాత మోడల్ ఫోర్డు కారు అడ్డంగా కనుపించింది.

బోనెట్ ముందు సిగరెట్ కాలుస్తూ నిలుచున్నాడు కిశోర్ సింగ్. లోపల నలుగురైదుగురు వున్నట్లుగా తోచింది. నాచేత పొందిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోనేందుకు సిద్ధపడి వచ్చారని తెలుసుకోనేందుకు పెద్ద ఊహ, ఆలోచన అవసరం లేకపోయింది.

వాళ్ళతో తలపడటానికి అది సరయిన సమయంకాదు. నా కోసం కేసినోలో సావిత్రీదేవి కాచుకుని వుంటుంది. నా దగ్గరేమో పదిలక్షల రూపాయలు క్యాష్ వుంది. అంత డబ్బు వాళ్ళ కళ్ళబడిందంటే నన్ను ముక్కలు ముక్కలుగా నరికి పారేసేటందుకూ్యడా వెనుకాడరు.

డాష్‌బోర్డులో ఎడంచెయ్యి పెట్టి, రివాల్వరు తీసుకున్నాను. దాన్ని కుడిచేతిలోకి మార్చుకొని, డ్రైవింగ్

వీల్ను ఎడంచేత్తో పట్టుకున్నాను. ఇంజన్ ఆన్ చేసి వుంచాను.

కిశోర్ సింగ్ మాత్రం ధైర్యంగా అక్కడే నిలబడి వున్నాడు. ఆ కారును తప్పుకుని వెళ్ళే మార్గం లేదు. రివాల్వరు పేలుస్తూనే కారును రివర్స్ చేసి బంగళా లోనికి పోనిచ్చాను. రివాల్వరు చేత్తో పుచ్చుకునే ఒక్క వుదుటున ఇంట్లో దూరాను. తలుపులు మూసుకున్నాను.

టెలిఫోన్ డయల్ చేసి నా అడ్రసు చెప్పి పెద్ద ఫైర్ ఆక్సిడెంటయిందనీ, వెంటనే హెల్ప్ పంపమని చెప్పాను. ఆ తర్వాత పోలీసులకుకూడా ఫోన్ చేశాను ఫైరాక్సిడెంటయిందని. మేడపైకి వెళ్ళి రోడ్ వైపు చూశాను. రోడ్ కు అడ్డంగా కారుమాత్రం వుంది. కిశోర్ గానీ, అతని అనుచరులుగానీ నాకు కనుపించలేదు. నన్ను వల్లో వేశామన్న తృప్తితో, బంగళాలోకి వచ్చి వుంటారనుకున్నాను.

మెయిన్ డోర్ పగలగొట్టి రావచ్చు. కానీ అది కష్టం. అంతకు ముందొచ్చినట్లు, డ్రెయిన్ వాటర్ పైప్ పట్టుకొని పైకిరావచ్చు. నేను బెడ్ రూం తలుపులు బిగించుకొని కిటికీగుండా చూడసాగాను. ఎవరన్నా ఆ పైప్ పట్టుకొని పైకిరావాలనే ప్రయత్నించేస్తే, కాల్చి పారేద్దామని నిర్ణయించుకుని ఎదురు చూడసాగాను.

ఫైర్ ఇంజన్లు, పోలీస్ వాన్లు వచ్చేందుకు పదిహేను నిముషాలు పడుతుంది. అంతదాకా నన్ను రక్షించుకుంటే చాలు. ఆ తర్వాత కిశోర్ తన్నుతను రక్షించుకునేందుకు పలాయన మంత్రం చిత్తగించాలి.

గంట చూసుకున్నాను. పన్నెండు నలభై అయిదు అవుతోంది. మరో పదిహేను నిముషాల్లో సినిమా వదులుతారు. ఆ టయిమ్కు నేను అక్కడుండాలి. అది వీలవుతుందో కాదోనని ఆలోచించసాగాను. ఎందుకయినా

మంచిదని కాసినో థియేటరు మానేజర్‌కు ఫోన్ చేసి, బాక్స్‌లో వున్న రాణీ సావిత్రీదేవితో అర్జంటుగా ఒక నిమిషం మాట్లాడాలని చెప్పాను.

అతను ఆడియన్స్‌ని డిస్టర్బ్ చెయ్యడం తమకుఅలవాటు లేదన్నాడు. అంత అవసరమయిన విషయమేదన్నా వుంటే తనతో చెప్తే, షో వదిలాక చెప్తానన్నాడు. అదన్నా నయమనుకొని, నా పేరు చెప్పి, కొద్దిగా ఆలస్యంగా వస్తాననీ, వచ్చిందాకా అక్కడే వెయిట్ చెయ్యమనీ ఆవిడకు చెప్పమన్నాను. అతను సరేనన్నాడు. థాంక్స్ చెప్పి, ఫోన్ కట్ చేశాను.

ఫైరింజను శబ్దం వినిపించింది. రెండు క్షణాల్లో పోలీస్ పాట్రోల్ కార్ సైరన్ కూడా వినపడింది. నా ఇంటి కాంపౌండ్ లోంచి పిచ్చికుక్కల్లా పరుగె త్తిపోతున్న కిశోర్ సింగ్ నూ, అతని అనుచరుల్ని చూశాను. కారక్కడే వదిలేశారు. దాన్ని అడ్డం తొలగించి, నా బంగళాలోకి రావాలి పోలీసులు. ఫైర్ సర్వీస్ వాళ్ళు వాళ్ళను కలుసుకొని, ప్రశ్నలకు జవాబులు చెపుతూ నిలుచుకోవడం నా కిష్టం లేకపోయింది. అందుకుని, డ్రెయిన్ పైపు పట్టుకొని వెలుపలకు జారాను. గోడదూకి రోడ్ చేరి, ఎవ్వరికీ కనుపడకుండా జంక్షనుకొచ్చి టాక్సీ ఎక్కాను. స్టార్టుకాగానే 'కాసినో' అన్నాను.

టాక్సీ నిర్మానుష్యంగా వున్న రోడ్ మీద జోరుగా పోసాగింది. పన్నెండు నిముషాల్లో థియేటరు చేరుకున్నాను. అక్కడంతా నిశ్శబ్దంగా వుంది. లైట్లన్నీ ఆర్పివేసి వున్నాయి. రోడ్‌లో మాత్రం పెద్ద క్రిజ్లర్ కారు కనుపించింది. అదే సావిత్రీదేవి కారు. టాక్సీని కొంచెం దూరంలో ఆపి డబ్బిచ్చి దిగాను. అది కదిలి కనుమరుగయి పోయాక కారు దగ్గరకు నడిచాను.

"సారీ! మిమ్మల్ని వెయిటింగ్‌లో వుంచాను" అన్నాను.

బ్యాక్ డోర్ తెరచుకొంది. ఒక మూలగా నొదుగుకుని కూచునివుంది సావిత్రీదేవి. నేనుకూడా ఎక్కి కూర్చున్నాను. ఆమె కాలితో ఏదో బటన్ నొక్కింది. ముందు డ్రయివరుకు, మాకు మధ్య అడ్డు తెరలాంటిదేదో పడింది. అలాంటి ఏర్పాటు కార్లలో వుండటం చూడటం నాకదే మొదటిసారి.

"తెచ్చావా?" అడిగింది మెల్లగా సావిత్రీదేవి.

"మీరు తెచ్చారా?" అడిగాను నేను.

"ఆఁ!" అంది జాకెట్‌లో చెయ్యిపెడుతూ. బహుశా ఆ బంగారు కొండల నడుమవున్న లోయలో దాచివుంచి వుండాలనుకున్నాను. వెంటనే చెయ్యి వెలుపలికి లాగింది. మిలమిల మెరిశాయి వజ్రాలు. నెక్లెసు నాకందించింది. చూశాను. బ్రీఫ్ కేస్ తెరచి నోట్లకట్టలు ఇచ్చాను.

"థాంక్స్! ఆ కేస్‌గూడా ఇవ్వు. నిదానంగా పంపుతాను" అంది ఆమె.

"అలాగే!" అంటూనే నెక్లెసు జేబులో పెట్టుకొన్నాను.

అంతకుముందే టైపుచేసి వుంచిన రశీదును ఆమెముందు పెట్టి సంతకం చెయ్యమని పెన్నుతీసి అందించాను. బ్రీఫ్ కేస్ వొళ్లో పెట్టుకుని సంతకం చేసింది. ఆ రశీదుతీసి జేబులో పెట్టుకొన్నాను.

కారు కర్జన్‌రోడ్ దాపులకు రాగానే ఆపమని, దిగేశాను. కారు వెళ్ళిపోయింది. పాలిని ఇల్లు అక్కడకు దగ్గరలోనే వుంది. అయినా అంత ఖరీదైన నెక్లెసు దగ్గరుండగా ఆమెవద్దకు పోవడం ఎందుకో మంచిదికాదని పించింది. కొంతదూరం ముందుకు నడచి ఖాళీగా ఎదు

రొచ్చిన టాక్సీ ఆపి ఎక్కాను. అడ్రసు చెప్పి పోనిమ్మ న్నాను. నేను ఇల్లువదలి ఎంతసేపయి వుంటుందో చూద్దా మని వాచీకేసి చూశాను. ఒకటి యాభై అయింది. అంటే నలభై నిముషాలయి వుండాలనుకున్నాను.

నేను ఇంటిముందు కొచ్చేసరికి రోడ్ అంతా నిర్మా నుష్యంగా వుంది. ఫోర్డుకారు కూడాలేదు. అంటే దాన్ని పోలీసులు లాక్కుపోయి వుండాలి అనుకున్నాను.

ఇంటిముందు దిగి టాక్సీవాలాకు డబ్బిచ్చి లోనికి నడిచాను. పోర్టికోలో కూచుని బీడిత్రాగుతున్న పోలీస్ జవాను కనుపించాడు.

నన్ను చూడగానే లేచి "ఎవరు" అన్నాడు.

"నేనే! ఈ ఇల్లు నాది. నువ్వెందుకున్నావ్?" అడి గాను.

"మీరు రాగానే వెంట బెట్టుకుని తీసుకురమ్మని మా ఇన్ స్పెక్టర్ గారు నన్ను ఇక్కడ వదలి వెళ్ళారు. వెళ్దాం రండి!" అన్నాడు పోలీసు జవాను.

"ఎందుకు? ఏం జరిగింది?" అడిగాను.

"నాకు తెలీదు సార్!" అన్నాడు అతను.

చేసేదిలేక అతనివెంట నడచాను.

ఇన్ స్పెక్టర్ను వదలించుకుని తిరిగి రావడానికి రెండు గంటలు పట్టింది. నానారకాల ప్రశ్నలు వేశారు. అతని మనస్సులో వున్న అనుమాన మేమిటో నాకు అర్థంకాలేదు. కారుండగా, దాన్ని ఇంట్లోనే వదలి, టాక్సీలో వెలుపలకు ఎందుకు వెళ్ళావన్నాడు. ఏదో చెప్పాను. నా కారుని ఒంటిగంట ప్రాంతంలో రేను తాకిచూశానని, బానెట్ వేడిగా వుందనీ, ఎవరో వాడారనీ చెప్పాడు. నేను ఒప్పుకోలేదు. ఎలాగో వదలించుకున్నానతన్ని. నాకు కశోర్ సింగ్ గురించి తెలీలేదు. ఇన్ స్పెక్టర్ చెప్తాడేమో

నని ఎదురుచూశాను. అతను ఆ ప్రశంస తేలేదు.

గా్రడెన్ లోని డ్రాయరు తెరచాను. మంచి నెక్లెసు అందులోపెట్టి తాళంవేసి, నకిలీ నెక్లెసు తీసి పాంటు జేబులో పెట్టుకొన్నాను ప్రొద్దున్నే ఖాన్ మొహాన పారేసేందుకు.

గ్లాసునిండా విస్కీ పోసుకుని త్రాగి లైటార్పి పడు కున్నాను.

# 7

తెల్లారి పదకొండు గంటలకు మెలకువ వచ్చింది. స్నానం చేసి డ్రెస్ చేసుకొని, కార్లో బయలుదేరాను. ఖాన్ కు నెక్లెస్, రశీదు ఇచ్చాను. అందుకుంటూ నాకేసి ఆనం దంగా చూశాడు.

"గ్లాడ్! మన ప్లాన్ సగం సక్సెస్. మిగిలింది కూడా సక్సెస్ చెయ్యాలి!" అన్నాడు ఖాన్.

"డెఫినెట్ గా! మీరు నిశ్చింతగా వుండండి" అన్నాను.

"నిన్ను నమ్ముకునే దిగా నీ వ్యవహారంలో" అన్నాడు ఖాన్.

"ఈలోగా వాట్ని విడదీసి, వేరే డిజైనలో మంచి సెట్ గా తయారుచేసే ఏర్పాటు చూడండి. డిజైన్ సెలెక్టు చేశాక నాకోమారు చూపించండి" అన్నాను. ఖాన్ మంచి డిజైనర్.

"అలాగే!" అన్నాడు.

నా కక్కడ చేసే పనేమీ లేదు. అందువల్ల ఖాన్ తో చెప్పి వెలుపల కొచ్చాను. కారెక్కి తిన్నగా షాలిని ఇంటికి పోనిచ్చాను.

నే వెళ్ళేసరికి మంచానికి అడ్డంగా బోరగింతలా పడు కుని ఏవో 'న్యూడ్' ఫోటోల పుస్తకం తదేకంగా

చూస్తూంది. దగ్గాను. తలెత్తి చూసి లేచి కూచుంది.

"ఎలాగుంది ప్రేమ? తగ్గిందా? ఎక్కిందా?" అడిగింది నవ్వుతూ.

"తగ్గడం ప్రశ్నే లేదు!" అన్నాను ఆమెకు కొంచెం దగ్గరగా కూర్చుంటూ.

"అయితే విషంలా ఎక్కుతూనే వుందన్నమాట!"

"అవును! కానీ నీకింకా నాపైన కోపం తగ్గినట్లులేదు. ఆ కిశోర్ గాడు రాత్రి మళ్ళా ఇంటికొచ్చాడు. చంపేందుకు సిద్ధంగా వచ్చినట్లున్నాడు" చెప్పాను.

"నో! నాకు తెలీదు!" అంది షాలిని.

"తెలిసినా నాకు బాధలేదు. జరిగింది చెప్పాను."

"ఎలా తప్పించుకున్నావ్?"

"తెలివంటూ వుండాలికానీ, వాడొక లెఖ్ఖా!" అన్నాను. షాలినితో పరిచయం లేకముందు ఆనిలాంటి కిరాతకులకు ఆరు ఆమడల దూరంగా ఉండేవాణ్ణి.

"నా ప్రశ్న కదికాదు జవాబు!"

"తెలుసు. ఆ జవాబు ఆ వెధవే చెబుతాడు. నీతో ఒక ముఖ్యమైన విషయం గురించి మాట్లాడాలని వచ్చాను" అన్నాను.

"ఏమిటది!"

"మనం పెళ్ళాడాలంటే డబ్బుకావాలి. పది పరకా కాదు. లక్షలు. అది న్యాయంగా సంపాదించాలంటే ఎన్నో ఏళ్ళు పడుతుంది. ఆలోగా మనం ఇద్దరం ముసలి వాళ్ళమయిపోతాం. అందుకనే అడ్డదారులు వెతుకుతూండి పోయేను. ఒకదారి తెలిసింది. అయితే నీ సాయం కావాలి. వచ్చే మొత్తంలో చెరిసగం తీసుకుందాం. నీ భాగం నీ స్వంతం. నీ ఇష్టమొచ్చినట్లు ఖర్చుచేసుకో. నా భాగం మాత్రం మనిద్దరికీని" అన్నాను.

"అసలు సంగతి అర్థమయ్యేట్లు చెప్పు" అంది షాలిని మోకాళ్ళచుట్టూ చేతులు వేసుకొని గడ్డం వాటిపైన ఆనించి చూస్తూ.

"రాంనగర్ రాణి సావిత్రీదేవి పేరు ఎప్పుడైనా విన్నావా?"

"విన్నాను."

"ఎప్పుడు!"

"ఆ మధ్య ఆమెదగ్గర ప్రపంచంలోకల్లా విలువైన వజ్రాల నెక్లెసుఏదో వుందనీ, అది మెళ్ళో వేయించుకుని తీయించుకున్న ఫొటో పేపర్లలో వేశారు. దాన్ని చూశాను" అంది షాలిని.

"దాని విలువెంతో తెలుసా?"

"తెలీదు!"

"ముప్పయి లక్షలు. కాస్త ధైర్యం చేస్తే దాన్ని మనం సులభంగా దొంగిలించవచ్చు" అన్నాను.

"ఎలా? పట్టుబడితే పదేళ్ళు జైల్లో పడివుండాలి!" అంది షాలిని.

"అటువంటి ప్రమాదమేమీ లేదు. నీకు ధైర్యం వుంటే చెప్పు. దాన్ని మనం స్వంతం చేసుకుందాం. మెల్లగా ఒక్కొక్క వజ్రమే అమ్ముకుందాం. డబ్బు చేసుకుందాం" అన్నాను.

"నాకు ధైర్యమే! ఏం చేయాలో చెప్పు" అంది షాలిని.

"మీ అన్నయ్య ఎలాంటివాడు?"

"మధ్య అతని ప్రసక్తి ఎందుకు?"

"అవసరం వుంది కనుక అడిగాను. మీరిద్దరూ మారు వేషాల్లో ఎవరూ తిరిగి గుర్తుపట్టడానికి వీలు లేకుండా తయారు కావాలి. మీకు రెండు రివాల్వర్లిస్తాను.

వాటిలో గుండ్లు పెట్టనవసరం లేదు. నా స్తేనే నాలు జెరిగిపోయే మనిషితో మన వ్యవహారం నడవబోతుంది. ఎన్నిగంటలకు, ఎక్కడకు, ఎలా రావలసిందీ, ఎలా భయపెట్టవలసిందీ, ఆ నెక్లెసును ఎలా దొంగిలించవలసిందీ, నీకు తర్వాత చెప్తాను. సరేనా?"

"అదిసరే! తీరా నెక్లెసు దొంగిలించుకొని వెళ్ళిపోతే నువ్వేం చేస్తావ్. నోట్లో వేలు వేసుకోవలసిందే" అంది షాలిని.

"అంత వెధవను గాను. దాన్ని తీసుకుపోయి మీరేమీ చెయ్యలేరు. అందులోని చిన్నరాయి అమ్మజూసినా పోలీసుల దృష్టిలో పడి చిన్నగా జైలుకు పోతారు" అన్నాను.

"మరి నువ్వుపోవాలి?"

"నేను ఆ వ్యాపారంలో ఉన్నవాణ్ని. నన్నెవరూ అనుమానించరు. నాకు తెలిసినంతమంది గౌరవనీయులైన వ్యక్తులు, నల్లడబ్బుతో నగలు చేయించుకొనే మనుషులు మీకు తెలీదు. నా రహస్యం వాళ్ళ దగ్గరా, వాళ్ళ రహస్యం నాదగ్గరా క్షేమంగా వుంటాయి" అన్నాను నవ్వుతూ.

"ఆల్ రైట్! ప్లానంతా పూర్తిగా తయారుచేసి చెప్పు. ఈ దెబ్బతో మన దరిద్రం తీరిపోతుంది. హాయిగా ఏ అమెరికాకో వెళ్ళి బ్రతుకుదాం!"

"అలాగే. వస్తాను" అని అక్కణ్ణుంచి బయలుదేరాను.

ఆ తర్వాత రెండు రోజులు ఉదాసీనంగా, ఏవిధమైన సంఘటనా జరగకుండానే గడిచిపోయాయి. రెండుసార్లు మా బాస్ ఫోన్ చేసి నెక్లెసు అమ్మేందుకు ప్రయత్నాలు చేస్తూండమని హెచ్చరించాడు. సరేనన్నాను.

మూడవరోజుకు నా మైండ్‌లో దొంగతనం చేసేందుకు ప్లాన్ పకడ్బందీగా తయారయింది. ఆరాత్రికే అమలు పరచాలని తీర్మానించుకొన్నాను. ప్రొద్దున్నే లేచి బజారు కెళ్ళి రెండు విగ్గులు, మెర్క్యూరీ పూసిన సన్‌గాగుల్స్ జతలు రెండూ, ఆడవాళ్ళు వేసుకనే సూటు, మగవాళ్ళు తొడుక్కునే గుర్రూ షర్టూ, పాంటు, అన్నీ కొన్నాను. వాటిని టాక్సీలో పెట్టుకొని పాలిని ఇంటికి చేరాను.

నేవెళ్ళేసరికి డ్రెస్ చేసుకుంటూంది. నన్ను చూడగానే ఉత్సాహంగా వచ్చి కూర్చుంది ఎదురుగా.

"చెప్పండి! ఏమైంది?"

"ఏం కాలేదు! ఇవాళ రాత్రికే మనం పని పూర్తి చేయాలి. మీకోసం ఈ బట్టలు తెచ్చాను. ఇవి తొడుక్కుని విగ్గులు పెట్టుకుంటే ఎవ్వరూ గుర్తు పట్టరు. తెలిసిన వాళ్ళదగ్గరెక్కడ నన్నా టాక్సీ మాట్లాడుకోండి. మా బాస్ అడ్రస్ ఇదీ" అంటూ కాగితం అందించాను.

అందుకొని లోలోపలే చదువుకొంది పాలిని.

"అది చిన్న బంగళా. రోడ్ పైకి వుంటుంది. ఇంట్లో ఆయనొక్కడే వుంటుంటాడు. ఒక నౌకరు మాత్రం వున్నాడు. గేటు ఎప్పుడూ తీసి వుంటుంది. గేటు ప్రక్కనే వాడి గుడిసె వుంది. పిలిస్తే వాడేవచ్చి తలుపు తీస్తుంటాడు.

సరిగ్గా రాత్రి పదకొండు గంటలకల్లా మీరు అక్కడకు రావాలి. ఆ టైమ్‌కు నౌఖరు ఇంట్లో ఉండకుండా వెలుపలకు ఏదో పని చెప్పి పంపిస్తాను. మేము హాల్లోనే కూర్చుని వుంటాం. నెక్లెసు టేబుల్ పైన పెట్టివుంటుంది. ఇద్దరూ తుపాకులతో మమ్మల్ని బెదిరించండి. నేను మీ పైకి దుముకుతాను. నన్ను కొట్టండి. ఘట్టిగా కొట్టినా ఫరవాలేదు. నిజానికి కాస్త ఘట్టిగానే కొట్టండి. కాని

ఆయన్ను మాత్రం ఏమీ చేయవద్దు. నెక్లెసు లాక్కొని వెళ్ళిపోండి. మీ బట్టలు టాక్సీలోనే మార్చుకొని ఏ సెంటర్‌లోనో దిగేసి రిక్షా చేసుకొని ఇల్లు చేరుకోండి" అన్నాను.

"గుడ్! బాగుంది... మరి రివాల్వర్లు లేవే నా దగ్గర."

"తెచ్చాను." అంటూ రెండు తీసి అందించాను.

"ఒకటి నాది. రెండోది టాయ్ రివాల్వర్!"

షాలిని అందుకుని పరిశీలించి చూసింది. దేంట్లోనూ గుండ్లు లేవు. బట్టలు, రివాల్వర్లు అన్నీ తీసి, గోడవారగా నున్న అల్మారాలో పెట్టి తిరిగి వచ్చి కూర్చుంది.

"ఈ నెక్లెసు నీకు ఎప్పుడివ్వాలి?" అడిగింది.

"నేనే వచ్చి తీసుకుంటాను. నన్ను కలుసుకునేందుకు నువ్వు ప్రయత్నం చెయ్యవద్దు. వీలు చూసుకొని వస్తాను. అంతదాకా ఓపిగ్గా వుండాలి" అన్నాను.

"సరే! నా ఐ లైక్ యూ! యూ హావ్ గట్స్!" అంది గోముగా, మత్తెక్కిన కళ్ళతో నావైపు చూస్తూ షాలిని.

తక్కున ఆమెను బిగికౌగిట్లో బంధించి, పెదాలపైన ముద్దుల వర్షం కురిపించాను. కౌగిలి వదిలేసి ఆమెవైపు చూడకుండా వెళ్ళిపోయాను, ఇంకా వుంటే నా కోరికలు పిచ్చితలలెత్తుతాయన్న భయంతో.

అక్కడ్నుంచి ఆఫీసుకెళ్ళాను. ఖాన్‌గార్ని కలిశాను. ఆయన నెక్లెసు గురించి గుర్తుచేసి "త్వరగా అమ్మాలి కరణ్! కొంత డబ్బు అప్పుకూడా తెచ్చిపెట్టాను" అన్నాడు.

"అలాగే బాస్! మీరేవైనా డిజైన్లు చూశారా వాటిని సెట్‌గా తయారు చేసేందుకు" అడిగాను ఆయనకు ఏవిధమైన అనుమానం రాకుండా వుండేందుకు.

"చూశాను. కానీ సరయినదేదీ దొరకడం లేదు!"

"మనిద్దరం కలసి ప్రయత్నం చేస్తే పని తొందరగా తెములుతుందేమో?"

"కరెక్ట్! నువ్వు ప్రక్కనుంటే ఉత్సాహంగా వుంటుంది."

"అయితే రాత్రి పదిన్నరకి వస్తాను. మీరు సెలెక్టు చేసిన డిజైన్లు చూపించండి. మనం చర్చించుకొని ఏదో ఒకటి ఫైనలైజ్ చేద్దాం!" అన్నాను.

"అలాగే! కాస్త ముందుగా రారాదు!"

"వచ్చేవాణ్ణి. ఒక పార్టీతో విషయం కదిపాను. అతను తొమ్మిదింటికి రమ్మన్నాడు. మీ ఇంటికీ, అతని బంగళాకు దాదాపు ఇరవై కిలోమీటర్లుంది. అందుకని. లేకుంటే నాకు పనేమీ లేదు" అన్నాను. ఆఫీసు ఎనిమిన్నరకు గాని మూయరు. అందాకా ఖాన్ వెలుపలకి రాలేడు. అందుకే అలా అబద్ధం చెప్పాను.

"అలాగే! నీ గురించి వెయిట్ చేస్తుంటాను" అన్నాడు ఖాన్.

"మీరు బెంగపడకండి! దాన్నమ్మడం పెద్ద పనికాదు. కాకుంటే కాస్త టైమ్ పడుతుంది. అంతే!" అంటూ తేలిగ్గా నవ్వేసి అక్కడ్నుంచి ఇల్లు చేరాను.

భోజనం చేసి ఫాన్ వేసి మంచంమీద పడుకున్నాను. కిశోర్ సింగ్ ను ఎదుర్కొన్నదీ, అతన్ని ముప్పతిప్పలు పెట్టిందీ, నెక్లెసు దొంగిలించిందీ, పాలినిని ప్రేమించిందీ నేనేనంటే నాకు నమ్మకం కలుగ లేదు. నాలో ఇంత పెద్ద కృత్రిమమైన, క్రూరమైన మార్పెలా వచ్చిందో అంతు చిక్కడంలేదు. అదంతా పాలిని మహిమే! ఆమె అందం కోసం అలమటించాను. పొందుకోసం మనస్సు తపించింది. ఆమె కళ్ళముందు హీరోలా కనుపించాలని ప్రయత్నిం

చాను. నేను పోతున్న దారి మంచిది కాదని తెలుస్తూనే వుంది. కానీ అంతదూరం వెళ్ళాక ఇక వెనక్కి వెళ్ళే మార్గంలేదు.

సరిగ్గా పది గంటలకు ఇంటిదగ్గర బయలుదేరాను. అసలు నెక్లెసు నా దగ్గరే వుంది. పాలిని నన్ను మోసం చెయ్యాలని ప్రయత్నించినా ఫలితంలేదు. నకిలీ నెక్లెస్‌తో తృప్తి పడాల్సిందే! నా మీద కే పరిస్థితుల్లోనూ నేరం రాదు.

# 8

ఖాన్ ఇంటిముందు కారాపి వాచీ చూసుకున్నాను. సరిగ్గా పదిన్నరయింది. దిగి లోనికి వెళ్ళాను. గుమ్మంలోనే ఎదురైనాడు ఖాన్.

"కరెక్టుగా చెప్పిన టైముకు వచ్చేశావే! ఏమైంది?" అడిగాడు.

"ఏది?"

"నువ్వెళ్ళిన పని?

"మాట్లాడాను. మనదోవకు లాక్కొచ్చాను. మళ్ళీ ఎల్లుండి కలవమన్నాడు. ఏవీ మీరు సెలెక్టు చేసిన డిజయిన్లు చూపించండి" అన్నాను.

ఇద్దరం హాల్లో కూర్చున్నాం. టేబుల్ పైన నాలుగైదు బయిండు పుస్తకాలున్నాయి. దేశదేశాల్లోని నగల నమూనాలు అందులో వున్నాయి. అక్కడక్కడా గుర్తులు పెట్టి వున్నాయి పొడవాటి కాగితపు ముక్కలతో.

ఒక్కొక్కటి తీసి చూడసాగాను. కావాలనే పరిశీలించి చూస్తున్నట్లు టైమ్ తీసుకొంటూ ఉండిపోయాను.

"ఆ నెక్లెసుకూడా తీసుకురండి! దాన్ని దగ్గర పెట్టుకొని వజ్రాల సైజులు చూసుకుంటూ, డిజైన్లతో వాట్ని

ఊహించుకుంటూ చూస్తే ఏది బాగుంటుందో తెలుస్తుంది" అన్నాను. నా ఉద్దేశ్యం షాలిని వచ్చాక దానికోసం ఆమె వెతుక్కోనవసరం వుండకూడదు. అది బల్లపై వుండాలి.

ఖాన్ లోనికి వెళ్లాడు. కాలింగ్ బెల్ నొక్కాను. పనిమనిషి వచ్చాడు. పదిరూపాయల కాగితం ఇచ్చి రెండు గోల్డ్ ఫ్లాక్ సిగరెట్ పెట్టెలు, ఒక గోలీసోడా తెమ్మన్నాను. అతను వెళ్లిపోయాడు. సిగరెట్టుకొట్టు అర మైలు దూరంలోవుంది. ఆలోగా అంతా అయిపోవాలి.

ఖాన్ ఒక పెద్ద ఎర్రపెట్టె పట్టుకొచ్చి టేబుల్ పైన పెట్టాడు. మూతతీసి అందులోంచి పెద్ద ఎర్రకవరు తీసి విడిగా పెట్టాడు. దానిక్రిందనుండి నేనిచ్చిన నకిలీ నెక్లెసు తీసి టేబుల్ పైన మెల్లగా అమర్చాడు. పరిశీలిస్తూ కూర్చున్నాను.

దబదబమని బూట్ల చప్పుడయింది.

తలెత్తి చూశాను.

ఎదురుగా నేను కొని ఇచ్చిన దుస్తుల్లో, షాలిని, ఆమె వెంట మరోవ్యక్తి, ఆమె అన్నగారు ఇంకెవరో వున్నారు. రివాల్వర్లు మావైపు గురిపెట్టి చూస్తూ "హాండ్సప్!" అంటూ పెద్దగా అరిచారు.

నేను చేతులు పైకెత్తాను. కానీ ఖాన్ ఎత్తకుండా మగతనివేపు పరుగెత్తాడు నెక్లెసు చేత్తో పట్టుకొని. నేను చూస్తుండగానే ఖానును రివాల్వర్‌తో ధన్‌మని కాల్చి పారేశాడు. గుండ్లు గుండెలో దూరిపోయాయి. అమ్మో అని అరిచి పడిపోయాడు. నేను అతనివైపు దుమికాను. అతను నామీదకు దూకాడు. తలమీద ఏదో బలంగా పడింది. వీపు భాగం కుళ్లబొడిచినట్లయింది. అంతే, ఆ తర్వాత ఏం జరిగిందో తెలీకుండాపోయింది.

# 9

మళ్ళీ స్పృహ తెలిసేసరికి, నా చుట్టూ కాలిబూట్ల మెత్తటి చప్పుడూ, గిరగిరమని మెల్లగా తిరుగుతున్న ఫ్యాన్ సవ్వడీ, సీసాలు కదులుతున్న శబ్దం చూచాయగా వినిపించాయి.

"నర్స్! హౌ ఈజ్ ది పేషంట్!" అడుగుతున్నారెవరో.

"ఇంకా స్పృహ రాలేదు డాక్టర్!" చెప్పింది నర్సయి వుంటుందనుకున్నాను.

"బహుశా ఈదినం స్పృహ వస్తుంది. ఇది ఐదోరోజు కదూ!"

"అవును డాక్టర్."

"అతను కళ్ళు తెరవగానే ముందు నన్ను పిలువు. ఆ పోలీసు ఆఫీసర్ని లోనికి రానివ్వకు" అన్నాడు డాక్టర్.

దాంతో నాకు పరిస్థితి అర్థమైంది. నాకోసం పోలీసులు సిద్ధంగా ఉన్నారన్నమాట. షాలిని ఏమయింది? ఆమె వెంట వచ్చింది ఆమె అన్న కాదు. కిశోర్ సింగ్. అంటే నన్ను రంకులాడి మోసం చేసింది. ఆమె ప్రేమలోపడి దారుణం చేసినందుకు నన్ను నేనే నిందించుకున్నాను. నాకు జీవితాన్నిచ్చిన ఖాన్‌ను చేతులారా నేనే బలి చేశాను. రివాల్వరులో గుండ్లుండ కూడదనీ, ఊరకే భయపెట్టాలనీ నేను చెప్పినా, నామాట వినకుండా, లోడెడ్ రివాల్వరు తెచ్చారు వాళ్ళు. తన్నే చంపాలని అనుకుని వుంటాడు కిశోర్. ఖాన్ ముందుగా కలియబడటంతో అతనిని హతం చేశాడు.

నెక్లెసు గుర్తువచ్చింది. అది నాగుపాములాంటిది. అదే వాళ్ళను కాటువేస్తుంది. దానిని అమ్మజూపారంటే చిక్కిపోతారు. నాకు స్పృహవచ్చినట్లు పోలీసులకు తెలిసే

లోగా, ఏమేం జరిగిందీ తెలుసుకోవాలి నేను.

మెల్లగా కళ్లు తెరిచాను. గదంతా నిశ్శబ్దంగావుంది. ఫాన్ శబ్దంమాత్రం వినబడసాగింది. నర్స్ మెల్లగా లోనికొచ్చింది. నన్ను చూసి ఆమె కళ్లు ఆనందంతో మెరిశాయి.

"ఎలా వున్నారు?"

"బాగున్నాను."

"డాక్టర్ను పిల్చుకొస్తాను" అంటూ పోబోయింది.

"సిస్టర్! ఒక నిముషం!" అన్నాను.

ఆమె చటుక్కున ఆగి నాకేసి చూసింది. దగ్గరగా రమ్మని సైగచేశాను.

"ఏమిటి?"

"నాకు సిస్టర్స్ లేరు. నువ్వే నా సిస్టరు వనుకుంటాను. నా గురించి నీకేం తెలుసో చెప్పాలి" అడిగాను దీనంగా.

"ఎవరో దొంగలు మిమ్మల్ని కొట్టి, మరెవరో ఒకతనిని చంపి ఏదో నెక్లెసు దొంగిలించారట. పోలీసులు మీతో మాట్లాడాలని సిద్ధంగా వున్నారు. అంతే!"

"ఆ దొంగలు పట్టుబడ్డారా?"

"లేదట. వాళ్లగురించి సరైన సమాచారం చెప్పేవాళ్లే లేరట" అంది నర్సు.

"థాంక్స్! డాక్టరును పంపండి!" అన్నాను ఆమె వైపు కృతజ్ఞతతో నిండిన చూపులుచూస్తూ. ఆమె వెళ్లిపోయింది. డాక్టరొచ్చి ఇంజక్షనిచ్చి "పోలీసాఫీసరు వచ్చాడు. అతనితో మాట్లాడే ఓపికుందా?" 'అడిగాడు.

"రమ్మనండి!" అన్నాను లేచి కూర్చుంటూ. రెండు నిముషాల తర్వాత ప్లెయిన్ డ్రెస్‌లోవున్న పొడవుపాటి వ్యక్తి వచ్చాడు నా ముందుకు.

రాగానే నా పరిస్థితికి విచారం తెలిపాడు. తర్వాత

మొదలెట్టాడు పరిశోధన. అతని ప్రశ్నల్నిబట్టి, అప్పటికే వాళ్ళకు చాలా సమాచారం అందినట్లు అర్థం చేసుకొన్నాను. దొంగల్ని వర్ణించమని అడిగాడు. నేను చూచింది చెప్పాను. విన్నాడు.

నవ్వుతూ "అలాంటి బట్టలు నువ్వు కథియావాక్ డ్రెస్సుల్లో కొన్నట్లు సాక్ష్యం వుంది" అన్నాడు.

"నేనా? ఇంపాజిబుల్."

"ఆ షాపతను చెప్పాడు. నీ దగ్గరనే వోమారు వజ్రాల వుంగరం కొనేందుకు వచ్చాడట."

"పొరపాటు పడివుంటాడు."

"నీ మెర్సిడెస్ కారు కర్జన్ రోడ్ ప్రాంతాల్లో చాలా సార్లు కనుపించిందట. ఆ ప్రాంతాలుండేదంతా దొంగలు, రౌడీలు, తాగుబోతులు, వ్యభిచారిణులు. నీకు తెలిసిన వాళ్లెవరన్నా వున్నారా?"

"లేరు!" అన్నాను.

"మరి అక్కడేం పనివుంది నీకు."

"నేనెప్పుడూ వెళ్లలేదు ఆ రోడ్డుకు."

"కిశోర్ సింగ్ అనే పెద్ద రౌడీనిగానీ, షాలిని అనే పిక్ పాకెట్ గానీ నీకు తెలుసా?"

"తెలీదు!"

"దొంగతనం పోయిన వజ్రాలహారం ఖరీదెంత వుంటుంది?"

"నెక్లెసు పోవడమేమిటి?"

"అసలు దానికోసమే ఖాన్ ను హత్య చేశారు వాళ్ళు" అన్నాడు పోలీస్ ఆఫీసరు.

"నాన్సెన్స్! ఆరోజు మేము నకలీ నెక్లెసు పెట్టుకొని చూసుకుంటూండిపోయాం. బహుశా. దానిని తీసుకుని వెళ్ళి వుండాలి. అసలుది నా ఇంట్లో దాచి వుంచమన్ని

ఇచ్చాడు ఖాన్. అక్కడది భద్రంగానే వుండాలి"
అన్నాను.

"రియల్లీ!" విసుక్కుంటూ అడిగాడు.

"రియల్ గానే!" అన్నాను.

అతను వెలుపలకి వెళ్ళిపోయాడు. ఐదునిముషాల్లో తిరిగొచ్చి "మీ ఇంటికి మా వాళ్లను రమ్మన్నాను. అది ఎక్కడ దాచారో చెప్పండి వెళ్లివస్తాను" అన్నాడు.

అంతా చెప్పి, కోటుజేబులోవున్న తాళాలు తీసుకొని వెళ్ళమన్నాను. అతను వెళ్ళాడు. దీంతో నాపైనుండి వీళ్లదృష్టి మూడొంతులు తిరిగిపోతుందనుకున్నాను.

కంపెనీ లాయర్ లోకనాథం వచ్చాడు. నన్ను చూసి విచారం వ్యక్తంచేశాడు. ఖాన్ గారు పోయినందుకు కంట తడిబెట్టాడు. నాకు మొదటిసారి కన్నీళ్ళు వచ్చాయి.

"ఏమిటి విశేషాలు?" అడిగాను.

"ఏంలేదు. ఖాన్ వీలునామా నాచేత రాయించి రిజిష్టరు చేశాడు. అతనికున్న మొత్తం ఆస్తి రెండుభాగాలు చేసి ఒకభాగం నీకూ, మరో భాగం, ఆఫ్ఘనిస్తాన్ లో వున్న అతని తోబుట్టువుకు రాశాడు. అది చెప్దామని వచ్చాను" అన్నాడు.

వినగానే నామతిపోయింది. సరైన కమీషన్ కూడా ఇచ్చేందుకు బేరాలాడే ఖాన్ సగం ఆస్తి నాకు రాయడం విచిత్రంగా తోచింది. అమాటే లోకనాథంతో అన్నాను. విని నవ్వి "నీపైన ఆయనకు పుత్రప్రేమ బాబూ! డబ్బు ఎక్కువ ఇస్తే పాడుచేస్తావనికాదు గానీ పాడైపోతావని భయపడ్డాడు. నీకు పెళ్లిచేసి నీతోనే వుండిపోవాలని తన కోరికని నాకు పదేపదే చెప్పేవాడు" అన్నాడు లోకనాథం.

కన్నతండ్రిని నాకు తెలీదు. అంతకన్నా ఎక్కువగా

అభిమానించిన ఖాన్ ను నేనే చేజేతులా చంపించినందుకు నాపైన నాకు రోత పుట్టింది. ఆయనని పంపించేశాను. పిచ్చి పిచ్చిగా ఆలోచనలు చేస్తూ, క్షణక్షణానికి క్షమించమని ఖాన్ ను వేడుకుంటూ, మరో మూడ్రోజులు ఆస్పత్రిలో గడిపాను. నెక్లెసు దొరకగానే పోలీసులు హంతకుల్ని పట్టుకునేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు. నన్నుగూడా రెండు మూడుసార్లు వచ్చి కలిశారు.

# 10

ఐదోరోజున డిస్చార్జయినాను.

తిన్నగా ఇంటికి వెళ్ళాను. లోపల కడుగుపెడుతుండగానే ఫోన్ మ్రోగింది. రిసీవరు అందుకున్నాను. "హల్లో కరణ్ స్పీకింగ్!" అన్నాను.

"ఇంటికొచ్చావా?" ఆ గొంతు కిశోర్ ది.

"వచ్చాను" అన్నాను కూర్చుంటూ.

"ఆ నెక్లెసు నాదగ్గరుంది. ఎప్పుడొస్తావ్?"

"ఎందుకు?"

"అమ్మిపెట్టేందుకు?"

"రాను. రావలసిన అవసరం నాకులేదు. ఖాన్ చని పోతూ విల్లు రాశాడు. అతని ఆస్తిలో సగం నాకొచ్చింది. దాని విలువ ఎంతో తెలుసా ఫూల్. రెండుకోట్లు. ఆ నెక్లెస్ నువ్వే అమ్ముకో!" అన్నాను.

"నాకు చేత రాదు! నే చెప్పినట్లు వినకుంటే నిన్ను పోలీసులకు పట్టిస్తాను."

"ఏమని చెప్తావ్?"

"నీ రివాల్వరుతో నే హత్య చేశాను. అది నా దగ్గరుంది. నువ్వే నాకళ్ళముందే కాల్చి చంపావని, నేనూ పాలిని సాక్ష్యం చెప్తాం. ఆ స్త్రీలో వాటా అర్జంటుగా దక్కించు

కోసేందుకు నువ్వే చంపి వుంటావని కోర్టు నమ్ముతుంది. ఎలాగుంది ఐడియా?"

"బాగుంది," అన్నాను ఏదో ఆలోచించుకుంటూ. నాకు చావన్నా భయంలేదు. జైలంటే భయంలేదు. కాని కిశోర్, షాలిని మాత్రం తప్పించుకుని పోగూడదు.

"అయితే తప్పదంటావా?" అడిగాను.

"తప్పదు!" అన్నాడు కిశోర్.

"షాలిని ఎక్కడుంది?"

"నా దగ్గరేవుంది."

"అయితే నెక్లెస్ తీసుకుని రాత్రికి రండి మాట్లాడుకుందాం!" అన్నాను.

కిశోర్ సింగ్ పదింటికి వచ్చాడు, షాలినితో.

ముగ్గురం హాల్లో కూర్చున్నాం. నా పరిస్థితులు వివరించి చెప్పాను. వాళ్ళిద్దరి దగ్గరున్న నెక్లెసును పదిలక్షలకు కొనేట్లు తీర్మానం చేసుకొన్నాను. ఆ తర్వాత వాళ్ళిద్దరూ నా జీవితంలోకి రాకుండా వుండేందుకు ఒప్పుకొన్నారు.

ఇద్దరికీ చెక్కు రాసిస్తానన్నాను. కాష్ కావాలన్నారు. ఐతే తెల్లారాక తెచ్చిస్తానన్నాను.

మాకు కుదిరిన అగ్రిమెంటుకు అందరం ఆనందించాం. కిశోర్ సింగ్ నన్ను సెలబ్రేట్ చెయ్యమన్నాడు. సరే నన్నాను. లేచివెళ్ళి బార్‌లోంచి విస్కీసీసా, సోడా, గ్లాసులు తెచ్చి అక్కడ పెట్టాను. ముగ్గురికీ విస్కీపోసి సోడాతో కలిపాను. ఐస్ గడ్డలు అందులో వేశాను.

"ఛీర్స్" అనుకొని త్రాగటం మొదలెట్టాం.

నా ముప్ఫయి ఆరేళ్ళ జీవితంలో దాదాపు పదహారు సంవత్సరాలుగా విస్కీ త్రాగడం అలవాటు. నాకు ఎప్పుడూ అంత రుచిగా కనుపించలేదు. విషం అంత తియ్యగా వుంటుందని నాకు తెలీదు. ఆ విషం తీపిదిగాదు.

నేను సంతోషంతో చేస్తున్న పనికి సంబంధించింది. రెండు నిముషాలకు నాకేం కనుపించలేదు. షాలిని, కశ్మీర్ సింగ్ అంటుకుంటుండే తలలు వాల్చేశాయి.

ఖాన్‌కు మనస్సులో నమస్కారం చేశాను. అంతే! ఆపైన నాకు తెలిసిందేమీ లేదు!

—: ఐపోయింది :—

# సాలెగూడు

కంచర్ల రమణి

ఉదయం పది కావస్తుండగా మెలకువ వచ్చింది హేలకు.

అయినా, వెంటనే లేవాలనిపించలేదు ఆమెకు. గది సీలింగువైపు చూస్తూ, అలాగే మంచంమీద పడుకుని, ఆలోచనల్లో పడిపోయింది.

హేలకు పాతికేళ్ళుంటాయి. ఆరోగ్యంగా పచ్చగా నిగనిగలాడుతూ ఉంటుంది ఆమె ఒళ్ళు. మగాడి నిగ్రహాన్ని పరీక్షకు పెట్టే అవయవాల పొందిక ఆమెది.

పైగా, ఎలాంటి సున్నితమైన భావాలు కావాలన్నా సునాయాసంగా పలికే ఫొటోజెనిక్ ముఖం ఆమెది.

ఏడేళ్ళక్రితం, తను సినిమాల్లో చేరవచ్చునన్న ఊహ ఆమెకు కలలో గూడ లేదు.

అయితే, ఆమె స్కూలు ఫైనలు చదువుతుండగా, మస్తాన్ రావు అనే డ్రామా కంపెనీ యజమాని కొడుకుతో పరిచయమైంది.

ఆమెను నటినిచేసి సినిమాల్లో చేర్పించాలన్న అతని కోరిక బలంగా పనిచేసిందో, లేక ఆమె అందాల్ని ఎలాగైనా అనుభవించి తీరాలన్న అతడి పురుషవాంఛ తీవ్రంగా పనిచేసిందో స్పష్టంగా చెప్పలేంకాని, ఆమెను సినిమాల్లో చేర్పిస్తానని చెప్పి ఆమెను మద్రాసు లేవదీసుకు వచ్చాడు.

సినిమాల్లో చేరక పూర్వం ఆమె పేరు ఈశ్వరమ్మ.

మస్తానురావు తండ్రికి డ్రామా కంపెనీ ఉంటే ఉండవచ్చుగాని, మస్తానురావుకు సినిమా రంగం గురించి బొత్తిగా తెలీదు. అతడు మొదట చెప్పుకొన్నట్టుగా నిర్మాతలెవరితోటీ పరిచయంలేదు.

ఆ సంగతి తెలియడానికి ఆరునెల్లు పట్టింది హేమకు. ఈ లోపున మస్తానురావుతో లేచి వచ్చినప్పుడు తనతో పాటుగ తెచ్చుకొన్న డబ్బు, నగలు, కరగి ఖర్చయి పోయాయి.

అప్పటికి హేమమీద మస్తానురావు మోజుకూడా తిరుగు ముఖం పట్టింది.

ఓ రోజున ఎప్పటిలా నిర్మాతల వేటకోసం వెళ్తున్నానంటూ చెప్పివెళ్ళిన మస్తాన్ రావు మరి తిరిగిరాలేదు.

అప్పటికి వారం రోజుల్నుంచి మస్తాన్ రావు ప్రవర్తన నిశితంగా గమనిస్తున్న హేమ, అతడు తనను శాశ్వతంగా వదిలేసి వెళ్ళిపోయాడని అర్థంచేసుకొంది.

ఆ రోజు ఓ రోజు వస్తుందని ఆమె చెదర చెదర అప్పటికి గుండె రాయిచేసుకొంది.

జరిగిందానికి విచారించడం హానుకని, భవిష్యత్తు గురించి ఆలోచించింది.

మస్తాన్ రావు వదిలేసిన సామానులు వెదికింది. సుమారు మూడొందల రూపాయలు, ఎవరో ఒక సినిమా నిర్మాత చిరునామా దొరికాయి ఆమెకు.

ఆ చిరునామా గంగం దొరది. అతడింటికి వెళ్లింది.

హేలను చూడగానే ఆమెలోని నటి లక్షణాలు గుర్తించాడు గంగం దొర.

తను తీస్తున్న చిత్రంలో ఆమెకు అవకాశం ఇచ్చాడు. ఆ చిత్రం గంగం దొరకు ఓ మోస్తరుగా లాభాలు తెచ్చి పెట్టాయి.

ఆమెను ఆదరించడంవల్లనే, తన అదృష్టం మారిందను కున్నాడు గంగం దొర. ఆమెను ప్రోత్సహించ నారం భించాడు.

ఒక్కొటంటే ఒక్కొటి తనకు హీరోయిన్ అవకాశం వస్తే పైకి ప్రాకిపోగలను.

అప్పుడే తాను అగ్రశ్రేణి నటీమణి అయిపోయినట్టు, ఆంధ్రదేశమంతటా కళాభిమానులు తనకు నీరాజనం పడు తున్నట్టూ హేల కలల్లో తేలిపోసాగింది.

అదే సమయంలో వీధితలుపు టకటకమని చప్పు డయ్యింది.

'ఎవరు చెప్మా?' హేల మంచంమీంచి లేచింది.

తన కలలు భంగపోచినందుకు అవతలివాడ్ని మనసులో తిట్టుకుంటూ తలుపు తెరచింది.

వీధి గుమ్మంలో ఎవరో ఇద్దరు అపరిచిత వ్యక్తులు నిలు చున్నారు. ఇద్దరూ ఇంచు మించు ఒకే వయస్సులో ఉన్నారు. అందులో ఒకాయన కుడి కంటిమీద అస హ్యంగా, కొట్టవచ్చినట్టు కనిపిస్తూ, పెద్ద గోలీకాయంత గుండ్రని మాంసం కండ ఉంది.

"ఏం కావాలండీ మీకు?" ఆమె అడగబోతోంది.

ఈ లోపున వాళ్లిద్దరూ లోనికి తోసుకొచ్చి, తలుపులు వేసి గడియలు బిగించారు.

వెనక్కి నాలుగడుగులు వేసి "ఏమిటీ దౌర్జన్యం?" అని ఆమె ఇంకా ఏమేమో అనబోతే "అరిచావంటే నీకే ప్రమాదం. మంచిగా చెప్పినమాట విను బాగుపడ్తావ్" అన్నాడు ఓ వ్యక్తి, పదునైన కత్తి మొన ఆమె కంఠానికి ఆనిస్తూ.

ఆమె ఒంట్లోని రక్తం ఒక్కసారిగా నీరయిపోయి నట్టయింది. నోరెండిపోయింది. గొంతుకలో నాలిక కదు లాడ్డం కష్టమైపోయింది.

బొమ్మలా కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయింది.

"ముందు నీ బెడ్ రూంకి పద" అన్నాడు ఇందాకటి వ్యక్తి.

ఆమె యంత్రంలా పడక గదిలోకి నడిచింది.

"కూర్చో అక్కడ" శాసించాడా వ్యక్తి.

మంచంమీద కూర్చుంది హేల.

ఆమె కెదురుగా రెండు కుర్చీలు లాక్కుని వాళ్లిద్దరూ కూచున్నారు.

కంటిమీద కాయున్న వ్యక్తి గొంతు సవరించుకుని "ముందు మమ్మల్ని పరిచయం చేసుకోనీ. నా పేరు సింగు. వీడి పేరు గంగు" అంటూ రెండో వ్యక్తి వైపు చెయ్యి చూపాడు.

అతని చేతికున్న స్టీలు కడియం మెరిసింది తెల్లగా.

క్షణం పోయాక, అతను మళ్లా మాట్లాడాడు.

"మాకు నీవల్ల సాయంకావాలి. అందుకే వచ్చాం ఇలా మాట్లాడదామని."

"ఏమిటా సాయం? అయినా నేను ఎందుకు చెయ్యాలి"

అడిగింది హేల బైటికి ధైర్యంగా. కాని, లోపల గుండెలు డబడబలాడి పోతున్నాయి.

"రంగం దొర ఇంట్లో దొంగతనం చెయ్యాలనుకుంటున్నాం. అందుకు నీ సాయం కావాలి. సాయం చేసినందుకు నీకు వాటా ఉంది" చెప్పాడు సింగు.

ఆ మాటలు విన్న హేలకు తన గుండెల్లో ఒక వాడి బాకు దిగవేసినట్టయింది.

రంగం దొర తన దేవుడు. దిక్కు మాలిపోయి వ్యభిచారం తప్ప తనకు వేరే గతిలేదన్న సమయంలో, ఆశ్రయం ఇచ్చి తనని నటిని చేసాడు. అటు డబ్బూ, ఇటు పేరూ సంపాయించి పెట్టాడు.

అంతేకాదు. తననో అగ్రశ్రేణి తారగా చేసేంత వరకూ విశ్రమించబోనని వాగ్దానం చేసి, అందుకు కావాల్సిన రంగం అంతా సిద్ధపరిచాడు.

అలాంటివాడి ఇల్లు గుల్ల చేసేందుకు, కొల్లగొట్టేందుకు తను సాయం చేయాలా?

నోట మాటరాక సాణువులా ఉండిపోయింది హేల.

"యేమిటి చెప్పు. యేమిటంటావ్?" అడిగాడు సింగు, హేల జవాబేదీ యీయకపోయేసరికి.

ఆ మాటతో స్పృహ తెచ్చుకొని "ఏమిటీ? దొంగతనమా? రంగం దొర ఇంట్లోనా? నా చేతులమీదుగానా అందులోనూ?" అంది తల అడ్డంగా వూపుతూ.

"యేం? ఎందుకల్ల?" ప్రశ్నించాడు సింగు.

తన బ్రతుక్కి రంగం దొర ఎలాంటి ఆధారమో, అలాంటి వాడికి హాని తలపెట్టడం ఎంత హీనమో, ఎంత పాపమో వివరంగా చెప్పింది హేల.

తల పదేపదే విదిలించి పారేస్తూ "ఇంత ముసలమ్మ ఆలోచనలు గలదానివి సినిమాల్లో ఎలాగొచ్చావో నాకు

అరంగాకుండా ఉంది'' అని ఒక్క క్షణం ఆమె కళ్ళల్లోకి తీక్షణంగా చూసి, "నీకు కావాల్సింది డబ్బు. అది అందించే సుఖం. ఒక్క రాత్రితో నువ్వు లక్షాధికారిణివి అయిపోతావు. రాత్రనకా పగలనకా, షూటింగులకు పోయి, కళ్లు చెదరగొట్టే లైటులముందు నానాయాతనలు పడి సంపాయించ నక్కరలేదు'' అన్నాడు సింగు.

"నన్ను లెప్పగా అంచనా వేశారు. నాకు డబ్బు కావాలి. దాంతోపాటు పేరుకూడా కావాలి. పైగా మీరు చెప్పేది దొంగ డబ్బు. నన్ను నటిగాచేసి, ఆడబ్బు నాకు రంగిందొర ఇవ్వబోతున్నప్పుడు నేనెందుకు అతనికి ద్రోహం చెయ్యాలి?'' అంది హేల.

"నీ వాదన భేషుగ్గా ఉంది. కాని, ఎంతమంది తారలు శిఖరం చేరుకుంటున్నారు? ఎంతమంది ఆ ఔన్నత్యం నిల్పుకొని, డబ్బు, కీర్తి సంపాయించుకో గల్గుతున్నారు? సినిమారంగం ఓ వింతలోకం. ఎన్నో ఆశలు కల్పిస్తుంది. తీరే అవకాశాలు ఉన్నట్టు అన్పిస్తుంది. కాని అంతట్లో యేమవుతుందో తెలియదు. ఏదో ఒక అజ్ఞాత హస్తం అధఃపాతాళానికి తోసేస్తుంది.ఆ రంగాన్ని నమ్ముకోవడం అంత మూర్ఖత ఇంకోటి లేదని నేను వేరుగా చెప్ప నవసరం లేదు.''

సింగు ఆగాడు, ఆమె మొహంలో కదులాడే భావాల్ని గమనిస్తూ.

"అయినప్పటికీ, నేను రంగందొరకు అన్యాయం చెయ్యలేను. అతడు నా ప్రాణం. నా దైవం. అతణ్ని నమ్ముకున్నాను. నేను సమూలంగా నాశనం అయినా విచారించను'' దృఢనిశ్చయంతో అంది హేల.

"అయితే, మాతో సహకరించనంటావ్?'' తీవ్రంగా అన్నాడు సింగు.

"చెయ్యను. మీరేం చేసినా సరే."

"అసలు మేమేం చేస్తామో నీకు తెలుసా?"

"తెలుసు. కత్తితో పొడిచి చంపేస్తారు. ఆ తరువాత నా శవాన్ని యే గోనెసంచీలోనో పడేసి, దానికో రాయి కట్టి, చెరువులోనో, నూతిలోనో పడేస్తారు...... నేను చచ్చినా ఫరవాలేదు, గంగందొరకు మాత్రం అన్యాయం చెయ్యలేను" నిశ్చయంగా చెప్పింది హేల.

సింగు మెల్లగా తన కుర్చీలోంచి లేచాడు. ఆమెకు సమీపంగా వెళ్ళాడు. ఆమె మొహంకు చేరువుగా తన మొహం పెట్టి "హేలా! ఏం అందం నీది! వెన్నెల, పాలు, మల్లెలు కలిపి తయారుచేసినట్టుగా ఉంది"అంటూ ఆమె బుగ్గలు నిమిరాడు.

అతని కుడి కంటిమీద కండ, బండబారి కర్కశంగా రాతిముక్కల్లా తగులుతున్న అతని చేతివ్రేళ్లు-ఆమె ఒళ్లు గగుర్పొడిచింది. అతడి చెయ్యిని తోసేసింది, మీదబడ్డ పురుగును విదిలించినట్టుగా.

అతడు చెప్పసాగాడు. "ఈ అందంఉంది చూసావూ! అపూర్వం. అద్భుతం. అయితే, యీ యెడం చెంప ఉడికిపోయి రబ్బరు ముక్కను తాళ్ళతో కట్టి మొహం మీద అతికినట్టుగా ఉంటే యెలా ఉంటుందంటావ్?"

హేల గుండెలు, భయంతో గుబగుబ లాడిపోయాయి. ఎవరిదో మొహం తను చూసింది యీ మధ్యనే ఏదో అగ్ని ప్రమాదంలో జరిగిందట. మొహంమీద, మెడ మీద మాంసం కాలి ఉడికిపోయి, మెడ సాగదీసి ఉంచేసినట్టుగా ఉంది. పైగా యెడం కంటివద్ద మాంసం పీక్కుపోయి గుడ్లగూబ చూపు వచ్చింది ఆ కంటికి.

సింగువైపు భయంభయంగా చూసింది హేల.

"ఒరేయ్ గంగూ! చూపించరా!" అన్నాడు సింగు

గంగువైపుకు తిరిగి.

చిహ్నాంజీలా పళ్లికిలిస్తూ, గంగు తన జేబులోంచి ఓ బాటిలుతీసి "ఇది యాసిడ్ సీసా" అని హేలకు చూపి, సింగుకు అందించాడు.

సింగు బాటిలు అందుకుని హేల ముఖానికి చేరువగా ఉంచి, "చూడు హేలా! మసలుకొట్టే యీ ద్రవం ఉంచి చూసావ్వా. నేను ఇందాక వర్ణించిన రూపం ఇస్తుంది నీకు. అల్లంత దూరంలో చూడగానే జనం నిన్ను అసహ్యించుకుంటారు.

"ఈ సమయంలో నేను చెప్పాల్సిం దొకటుంది. మేం హంతకులం కాం. మేం దొంగలం. హత్య చేయడమే మా ఉద్దేశం అయితే ఓ రాత్రి రంగందొర ఇంట్లో దూరి, అతడ్ని చంపి, డబ్బు ఎత్తుకెళ్ళే వాళ్లం. అలా చెయ్యడం ఇష్టంలేకనే నీ సహాయం కోరుతున్నాం. ఇప్పుడు చెప్పు. మాతో సహకరించి, మేం సంపాదించిన దాంట్లో వాటా పొంది సుఖంగా వుంటావో, రాక్షసాకృతి పొంది ఎందుకు కొరగాకుండా, దిక్కుమాలిన బ్రతుకు బ్రతుకుతావో. చెప్పు. నీకు పావుగంట టైమిస్తున్నాను. ఆలోచించి చెప్పు మమ్మల్ని ఏంచెయ్యమంటావో" అని తన కుర్చీలోకి వచ్చి కూర్చున్నాడు.

తను ఎలాంటి క్లిష్ట పరిస్థితిలో చిక్కుకుందో తెల్సుకునే సరికి, హేలకు ఏడుపు పొంగు కొచ్చింది.

తను కొండకోన చేరుకోబోతుంటే ఎవరో తన కాలు ఒడిసి పట్టుకుని లాగుతున్నట్టుంది.

తను ఎన్నో కలలు కంది. తను త్వరలో అగ్ర శ్రేణితార కాబోతోందనుకుంది.

తన పురోగతికి కారకుడయిన రంగందొరకు మనసు లోనే కృతజ్ఞతలు తెల్పుకొంది, అతడికే తను అన్యాయం

చెయ్యాలి! ఎలా?

ఏడేళ్ళక్రితం మస్తాన్‌రావు తనని లేపుకువచ్చి, అడవి లాంటి మద్రాసు నగరంలో వదలి వెళ్ళిపోయినప్పుడుకూడా తను ఇలాంటి పరిస్థితే ఎదుర్కొంది.

ఆ తరువాత త్యాగి తెరకెక్కి కొద్దో గొప్పో పేరు తెచ్చుకున్నాక, మస్తాన్‌రావు తనను వదలివెయ్యడమే మంచిదనుకుంది.

రంగంబొట్లకు అన్యాయం జరుగుతుందని తనిప్పుడు దుఃఖిస్తోందిగాని, మస్తాన్‌రావు విషయంలో సంతోషించి నట్లే తను తరువాత సంతోషిస్తుందేమో?

అయినా, వాళ్ళు తనకిచ్చిన స్వేచ్ఛయేమిటి? వాళ్ళు చెప్పినట్టుగా చెయ్యకపోతే, ఏంజరుగుతుందో అతి నేర్పుగా చెప్పాడు సింగు.

తనకు అలాంటి బ్రతుకువద్దు. ఈనాడు యువతరాన్ని వెడెక్కించి చొంగలు కార్పించే తన అందాన్ని అందరూ చూసి అసహ్యించుకుని తప్పించుకుని తిరుగుతుంటే తను భరించి బ్రతకగలదా?

సింగు చెప్పినట్టుగా, వాళ్లతో సహకరించడంతప్ప తనకు వేరే గత్యంతరంలేదు.

పావుగంట గడిచింది.

హేమలత నిర్ణయం తెలిపింది.

"అయితే ఒక్క షరతు... మీరు రంగంబొట్లను చంపకూడదు. అంతే కాదు. మీతోపాటుగా నేనూ వచ్చేస్తాను."

"మేం హంతకులం కామని ముందే చెప్పాం. హత్యలు చేసి పోలీసుదళాన్ని కేకలమీద యెక్కించుకొనే తెలివి తక్కువ వాళ్ళం కాం. ఇంకో విషయం. మాతో నువ్వు ఉంటానంటే... మాకూ సంతోషమే."

"ఇంకా నేనేం చెయ్యాలో చెప్పండి."

"చాలా సింపుల్. వచ్చే శనివారంనాడు రాత్రి రంగంవారతో గడపడానికి వెళ్తావు కదా?... ఆ రాత్రి మేం వస్తాం అక్కడికి. రంగంవార ఇంట్లో ఎవరూ లేకుండా...అంటే పనివాళ్ళందరినీ ఇళ్ళకో సినిమాలకో పంపించే బాధ్యత నీది. ఆ తరువాత మాకు తలుపులు తీసి వదులు. తెల్లవార్లూ రంగంవార మత్తుగా నిద్రపోయి లేవకుండా, నిద్రమందు ఇవ్వు. అంతే! మాకు కావాల్సింది."

"అలాగే! ఆ పన్లన్నీ చేస్తాను" చెప్పింది హేల.

"తరువాత మనసు మార్చుకుని పిచ్చిగా ప్రవర్తించావంటే పరిణామాలు దారుణంగా వుంటాయి. ముందుగా హెచ్చరించలేదని ఆ తరువాత మమ్మల్ని నిందించవద్దు" అన్నాడు సింగు ఆమెవైపు సూటిగా చూస్తూ, కేలు తాటిస్తూ.

## 2

శనివారం రాత్రి ఎనిమిది గంటలకు హేల ఇంటికి కారు పంపించాడు రంగంవార.

రంగంవార పిలిచాడంటే ఎగిరిగంతేసి ఎంతో హుషారుగా ప్రయాణం అయ్యే హేలకు ముస్తాబు చేసుకోవాలనిపించలేదు. ఆకర్షణీయంగా అవుపించడానికి పౌడర్లు, సెంట్లు పూసుకోవాలనిపించలేదు.

ఉన్నపళంగా కార్లో కూచుని పోనీమంది హేల.

హేల ముస్తాబు చూసి ఆశ్చర్యపోయాడు డ్రైవరు.

హేలను చూడగానే రంగంవార కూడా ఆశ్చర్యపోతూ "ఏమిటి సంగతి? ముస్తాబు కావడానికి టైం లేక పోయిందా?" అని అడిగాడు.

అప్పటికిగాని తాను అనాలోచితంగా చేసిన తప్పు తెలుసుకోలేదు హేల.

రంగంథొర తను ముస్తాబు చేసుకోక పోవడానికి కారణం అడుగుతున్నాడు. తన మనసు బాగోలేదంటుంది. ఆ మీదట రంగంథొర కారణం అడుగుతాడు. తను చెప్పక తప్పదు అసలు కారణం.

తన బ్రతుకు సర్వనాశనం కావడానికి తను చెప్పే జవాబు రాజబాట. హేల మనస్సు దిగులుతో నిండి పోయింది.

జరిగిపోయింది తప్పు! అయితే ఇప్పుడేం చెయ్యాలి.

చట్టున ఓ ఆలోచన వచ్చింది.

చిరునవ్వు మొహంమీదకు తెచ్చుకుని చిలిపిగా నవ్వుతూ "సాదాగా వుంటే మీరు ఇష్టపడతారో లేదో కనుక్కో వాలనిపించింది. అదీగాక, మెరుపు బట్టలు కట్టుకుని మొహం మొత్తింది. పైగా, బట్టల్ని నామీద వుంచుతారు కనుకనా" అంది హేల.

రంగంథొర మొహాన్ని మబ్బులా మూసిన అనుమానం ఏదో మెల్లగా తొలగిపోయింది.

"ఇంకా యేమిటో అనుకున్నానులే" అంటూ అతనూ నవ్వేసి, ఆమెను తన కవుగిట్లోకి లాక్కుని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె పైటను లాగి వివస్త్రను చేయబోయాడు.

"ఆగాలి! తొందరకూడదు" అంటూ అతన్ని వారించి "ముందు పనివాళ్ళను పంపించి రానివ్వండి" అంది హేల.

"ఉండనీ వాళ్ళను. వాళ్ళేం చేస్తారు? పైగా మనం మేడమీద గదిలో ఉండి తలుపులు వేసుకుంటామాయె!" ఆమె చెయ్యి పట్టుకుని నిలవేసి, ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు రంగంథొర.

అతడి చూపులు తప్పించుకుంటూ "మీకంతా విడమర్చి చెప్పాలా?" అని రంగంనొర బాధపడ్డట్టు కన్పించగానే "ఇవాళ మనం ఆదాం, యూవ్ లు లాగు ఇల్లంతా స్వేచ్ఛగా తిరుగుతూ ఆనందిద్దాం. ఎప్పుడూ గది తలుపులు మూసుకుని మంచంమీద ఆయాసపడ్డం అంటే విసుగేస్తోంది బాబూ!" అంటూ రాగాలు తీసింది హేల.

దాంతో రంగంనొర మొహం నవ్వుతో వెలిగిపోయింది.

హేల చెయ్యి వదిలేసాడు. ఆమె మేడమీదనుంచి దిగువకు వెళ్ళింది. సూరాఖ్తో సహా పనివాళ్ళను కొంత మందిని ఇళ్ళకు, కొంతమందిని సినిమాకు పంపించేసింది.

తిరిగి వెనక్కి వస్తూ, అలాగే వంటింట్లోకి పోయి గ్లాసుతో పాలు తీసింది. అక్కడే గార్డినాల్ మాత్రలు రెండు పొడిచేసి పంచదారతోపాటు పాల్లో వేసి కలియపెట్టింది.

ట్రేలో పెట్టి తెచ్చిన పాలగ్లాసు అందుకుంటూ "మరి నీకో?" అన్నాడు రంగంనొర.

"ఇక్కడికి తెండుకు వేరే తేవడం అని అక్కడే త్రాగేసాను" చెప్పింది హేల.

గ్లాసులోని పాలు గటాగటా త్రాగేసి, ఖాళీ గ్లాసు దగ్గరో ఉన్న టీపాయ్ మీద ఉంచి, హేలను రెక్కపుచ్చుకు లాగాడు మంచంమీదకు.

విసురుగా వచ్చి అతడి గుండెలకు గాఢంగా అతుక్కుపోయింది హేల.

బరువైన ఆమె వక్షాల ఒత్తిడి తన గుండెలమీద రవంత సడలనీయకుండా, చేతులు జరిపి ఆమె జాకెట్టు వెనుక హుక్కాలు విప్పసాగాడు.

ఆఖరి హుక్కాను విప్పబోతుంటే, అతని కళ్ళముందు నల్లని తెర దిగినట్టయింది.

ఆ ఫీలింగు వదిలించుకోవాలని, రెండుసార్లు తల విదిలించాడు రంగందొర. కాని, ఫలితం లేకపోయింది.

నిద్రమత్తులో కూరుకుపోతూ మంచంమీద వాలిపోయాడు.

అప్పటికి రాత్రి పదిగంటలయింది.

హేమ చకచకా పరుగెత్తింది. వీధి గేటుకు వేసిన తాళం తీసింది.

ఆయిదు నిముషాల తర్వాత గంగు, సింగు అక్కడకు చేరుకొన్నారు.

ఇనప బీరువా ఉన్న గది హేమకు తెలుసు. రంగం దొర తలప్రక్కన ఉన్న తాళాలుతీసి, వాటితో బీరువా తెరిచింది.

ఆ ఇనుప బీరువా హేమకు రంగందొర ఎప్పుడూ చూపలేదు.

ఆమె కళ్ళు జిగేల్మన్నాయి చూడగానే.

వేల విలువచేసే నగలు, సుమారు యేభై లక్షలవరకూ ఉన్న సరికొత్త కరెన్సీ ఒక్కచోట ఉండగా, ఆమె యెన్నడూ చూళ్ళేదు.

తమతో తెచ్చుకున్న రెండు సంచుల్లో ఒక సంచిలోకి నగలు, రెండో సంచిలోకి నగదు సర్దాడు సింగు. నగలున్న సంచీ గంగుకు అందించి, నగదు సంచీ తనవద్ద ఉంచుకుని "ఇహ బయలుదేరండి త్వరగా. రాత్రికి రాత్రి యీ ఊరు వదలి పారిపోదాం" అంటూ తొందరచేసాడు సింగు.

తొందరగా కదలి, మేడ దిగి వస్తుంటే, దిగువన నడవలో ఉన్న ఫోను గణగణమంటూ మ్రోగింది.

కొయ్యల్లా ఉండిపోయారు ఉన్నచోటునే.

అంతటా భయంకర నిశ్శబ్దం. వాళ్ళ గుండె చప్పుడు వాళ్ళకే విన్పించే నిశ్శబ్దం.

"ఫోను మోగనీయండి. మనం వెళ్ళిపోదాం పదండి" అన్నాడు గంగు, సింగు వీపుమీద చెయ్యివేసి నెట్టుతూ.

కాని, సింగు అతడ్ని ఆపేశాడు.

"అలా కాదు. రంగంగారకోసం ఏదో అర్జంటు కాలయ్యుంటుంది. ఫోను మోగుతున్నప్పటికీ, రంగంగార యెత్తకపోతే— అందునా, రంగంగార ఇంటివద్ద తప్పక ఉంటాడన్న వేళప్పుడు ఫోనుకు సమాధానం రాకపోతే, వాళ్ళకేవో అనుమానాలు కలగవచ్చు. సమీపంలో ఉన్న పోలీసు స్టేషనుకు రిపోర్టు ఇవ్వవచ్చు. మనం యీ వూరు నుంచి జెండా యెత్తేసేంతవరకూ, ఎవ్వరికీ ఇక్కడ దొంగ తనం జరిగిందన్న విషయం తెలియరాదు. కాబట్టి, గంగూ! వెళ్ళి ఫోనుకాల్ అందుకో. తెలివిగా ఏదో సమాధానం చెప్పు" ఆదేశించాడు సింగు.

సింగు ఆలోచన అద్భుతంగా ఉంది అనుకున్నాడు గంగు.

క్షణం ఆలస్యం చెయ్యకుండా పోయి ఫోను అందు కున్నాడు. "హల్లో!" అన్నాడు మౌత్ పీసులో.

"నే నెవరో మీకు తెలియడం అనవసరం. కాని, మీ హితైషిని. అది మాత్రం నిజం. మీరు అక్కడున్నట్టు, మీ గురించి ఎవరో పోలీసులకు ఉప్పు అందించారు. త్వరగా పారిపోండి. అయిదు నిముషాల్లో పోలీసులు అక్కడుంటా రేమో?" అన్నాడు అవతలి వ్యక్తి.

అంతే! గంగు ముఖం నల్లగా మాడిపోయింది. ఆ వ్యక్తికి 'థేంక్స్' చెప్పి, త్వరగా వెనక్కి వచ్చి సింగుకు చెప్పాడు తాను ఫోనులో విన్న విషయం.

సింగు ముఖంలో ఎక్కడలేని కంగారు కనిపిం చింది.

"ఏమిటి చెయ్యడం? ఏది దారి?" మతిపోయినవాడిలా

గొణిగాడు సింగు.

"ఇక్కడ్నుంచి కదలండి ముందు. ఇక్కడుండడం ఎంతైనా ప్రమాదం" ఆతృతగా అన్నాడు గంగు.

"అలాకాదు. నాకో ఆలోచన వచ్చింది. జాగ్రత్తగా వినండి" అంటూ వాళ్ళను ఆపి చెప్పాడు సింగు.

"మనందరం కలసి వెళ్తే ఒక్కుమ్మడిగా దొరికిపోతాం. మన శ్రమ వృధా అవుతుంది. మనం విడిపోదాం ఇక్కడ. అంటే, నువ్వు హేల కలసి వెళ్ళండి. నేను వేరేగా వెళ్తాను. ఒకరం దొరికిపోయినా, రెండో వారివద్ద ఉన్న దయినా దక్కుతుంది. అంతా సవ్యంగా జరిగితే, మన రహస్య స్థావరంవద్ద- అంటే ఊరవతల దెయ్యాలమేడలో కలుసుకుందాం. అక్కడ్నుంచి తెల్లారేలోగా ఎక్కడికో ఓ చోటుకు పారిపోయే ప్రయత్నం చేద్దాం. ఏం యెలా గుంది నా అయిడియా?"

సింగు చెప్పిందానికి తమ ఆమోదం తెల్పి, వెంటనే దొడ్డి త్రోవవైపున్న వీధిలోకి పరుగెత్తారు గంగు, హేల.

సింగు, వీధి ద్వారంవైపు పరుగెత్తాడు.

# 3

అగ్గిపుల్ల వెలిగించి దాని వెలుతురులో వాచీ చూసు కున్నాడు గంగు.

మూడున్నరయింది.

దెయ్యాల మేడలో కూచుని సింగు రాకకోసం గంట న్నర నుంచీ ఎదురుచూస్తున్నారు, గంగు, హేల.

ఇంకో రెండు గంటల్లో తెల్లవారిపోతుంది. ఇంత వరకూ సింగు వస్తున్న జాడలేదు.

సింగు దొరికిపోయాడేమో? అన్న భయం వారిని ఊపే స్తోంది.

ఒహూ వేళ, సింగు దొరికిపోతే, ఇకముందు కార్యక్రమం యేమిటి?

గతంలో గంగు, సింగు కలసి ఎన్నో దొంగతనాలు చేసారు.

ప్రతీసారీ, అయిడియా అంతా సింగుదే. అతడు చెప్పింది, తూచా తప్పకుండా ఆచరించి, వేసిన పథకం విజయవంతం అయ్యేలా చూడ్డం గంగు వంతు.

అయిడియా తనదే అయినప్పటికీ, వాటా మాత్రం సమానంగానే ఇచ్చేవాడు సింగు.

ఇంతవరకూ గంగు, సింగు కలసి చేసిన దొంగతనాల్లో పెద్దదిది. ఇలా ఎప్పుడూ పోలీసులకు ఆచూకీ అందడం గాని, దొరికిపోవడంగాని జరగలేదు.

ఇంకో అరగంట గడిచింది. సింగు రావచ్చన్న ఆశ పూర్తిగా పోయింది.

"ఏంచేద్దామంటావ్ హేలా? సింగు దొరికిపోయినట్టున్నాడు" అన్నాడు గంగు.

"ఏమో? నాకేం తెలుసు? అంతా అగమ్యగోచరంగా ఉంది. మిమ్మల్ని నమ్ముకుని వచ్చాను. నన్ను నట్టేటముంచేసారు. ఇహ బజార్లో ఒళ్ళమ్ముకుని బ్రతకటం తప్ప నాకు వేరే మార్గంలేదు" అంటూ రోదించింది హేల.

"మరీ అలా దిగాలుపడిపోకు. మనదగ్గర నగలున్నాయి. కనీసం పాతిక ముప్పైవేలు చేస్తాయి. ఇప్పుడు మనం నిర్ణయించుకోవాల్సింది... మనం యీ వూర్లో ఉండాలా? లేక ఇంకో చోటికి పోవాలా అని."

"నువ్వే యేదో తేల్చి చెప్పు. ఇలాంటి వాటిల్లో నాకు అనుభవంలేదు. అదృష్టం వక్రించి చిక్కుకున్నాను యీ కొంపిలో" అందామె ఇంకా ఏడుస్తూనే.

"తను పట్టుబడినా, మనం దొరక్కుండా పారిపోయి

కొంతయినా దక్కించుకోవాలనే మనల్ని వేరేగా వెళ్ళ మన్నాడు సింగు. అంటే, మనం ఇంకో ఊరు వెళ్ళిపోవాలి తక్షణం. ఒహవేళ తాను పట్టుబడకపోతే? తాను చెప్పి నట్లు మనల్ని ఇక్కడ ఎందుకు కలుసుకో లేదన్నది పెద్ద ప్రశ్న. సమాధానం ఊహించుకోవడానికి కూడా భయం కరంగా, బాధాకరంగా ఉంది. ఏది యేమైనా మనం ముందు ఇక్కడ్నుంచి ఇంకో ఊరు వెళ్ళిపోవాలి'' ఆలో చన చెప్పాడు గంగు.

అవుడు చెప్పందానికి తలూపి తన అంగీకారం తెల్పింది హేల.

ఇద్దరూ వెలుపలికి వచ్చి, రోడ్డు యెక్కారు.

సరిగ్గా అదేసమయంలో ఓ లారీ వస్తోంది మహా వేగంగా.

దాన్ని ఆపాడు గంగు. డ్రైవరుతో ఏదో మాట్లా డాడు.

గంగుని, హేలను ఎక్కించి, లారీని వేగంగా లాగిం చాడు డ్రైవరు.

# 4

మద్రాసుకు కొన్ని వందల మైళ్ళ దూరంలో ఓ మోస్తరు పట్టణంలో చిన్న తరహా హోటల్లో కాఫీ తాగుతూ, తనలో తాను తృప్తిగా నవ్వుకొన్నాడు సింగు.

తను వేసిన పటిష్టమయిన పథకం నెరవేరింది.

గంగుకు ఆలోచనా శక్తిలేదు. అయినా, ఇన్నేళ్ళుగా అతన్ని భరించాడు తను. కారణం? గంగుకు కండ బలం ఉంది. పైగా తనకు తోడుకావాలి.

రంగందార ఇల్లు దోచెయ్యడానికి తనే పథకం తయారు చేసాడు. అయితే, గంగుకు తెలిసింది అందులో

సగం మాత్రమే.

గంగుకు తెలియని, గంగు జన్మలో తెలుసుకోలేని ఎత్తు ఇంకోటి ఉంది.

ఉద్దేశపూర్వకంగానే తను గంగుకు నగల సంచీ అందించి, నగదు సంచీ తను ఉంచుకున్నాడు.

రంగందొర ఇంట్లో తాను ఉండగా, పోలీసులకు తమ ఆనవాలు తెలిసినట్టు, పోలీసులు వస్తున్నట్టు, తనే ఫోను చేయించాడు ఓ కుర్రాడికి డబ్బిచ్చి.

ఆడది పక్కనుంటే ఆపదలు వేరే కొనితెచ్చుకో నక్కర్లేదు. అందులో సినిమాల్లో నటించి, కాస్త పేరు తెచ్చుకున్న హేమలాంటి స్త్రీ అయితే, ఇహ చెప్పక్కర్లేదు.

ఆమెను తమతో చూడగానే, అవతలివాళ్ళకు అనుమానాలు కలుగుతాయి. ఆరాలు మొదలు.

ఇంకా దురదృష్టం పుచ్చితే, పోలీసులు, జైలు.

అందుకే, ఆమెనుకూడా గంగుతో పంపించివేసాడు నేర్పుగా.

తను వాళ్ళిద్దర్నీ గాలికి వదిలేసి, యే భైలక్షల నగదుతో పరారైపోయాడని గంగు ఓ పట్టాన నమ్మడు.

నమ్మినా, యేం చెయ్యలేడు తనని.

కనీసం నాలుగయిదేళ్ళపాటు ఆ డబ్బును తను బయటికి తీయడు. ఆ డబ్బు గురించి పోలీసులు, రంగందొర, చివరకు గంగు చల్లబడ్డారని, పూర్తిగా ఆశ వదులుకున్నారని తెలిసేంతవరకూ, ఆ డబ్బు ఖర్చుచేయడు.

అంతవరకూ రోజులు వెళ్ళబుచ్చడానికి, తనవద్ద తగినంత డబ్బుంది.

చేతిలో పుష్కలంగా డబ్బు ఉంటే, తను ఏయే ప్రదేశాల్లో తిని తిరుగుతాడో గంగుకు బాగా తెలుసు.

అంచేత, ఖరీదైన మత్తు పానీయాలు అమ్మే బార్లు, లేత ముంజెల్లాంటి అమ్మాయిల్ని సప్లయిచేసి సర్వ సౌఖ్యాలూ సమకూర్చే హోటల్సూ వదిలి దూరంగా పేద బ్రతుకు బ్రతకాలి.

ఏభై లక్షల రూపాయలు శాశ్వతంగా తనవి కావాలంటే, ఆ మాత్రం ఇబ్బందులు, అసౌకర్యాలు సహించక తప్పదు!

ఇంతలో —

సింగు ఆలోచనలకు అంతరాయాన్ని కలిగిస్తూ ఆరోజు పేపరు వచ్చింది.

ఆతృతగా అందుకుని చూసాడు, గంగంధార ఇంట్లో జరిగిన దొంగతనం గురించి వార్త పడిందేమోనని.

కాని, అలాంటి వార్త ఎక్కడా అగపడలేదు.

సింగు బరువుగా నిట్టూర్చి, పేపరు మూసాడు.

ఒకవేళ రిపోర్టు ఇచ్చినా, అనుమానం కచ్చితంగా హేలమీదే ఉంచుతాడు.

హేలకోసం గాలింపు జరుగుతుంది అప్పుడు. హేల గంగువద్ద ఉంది.

హేల పట్టుబడితే, నష్టపోయేది, బాధపడేది గంగు.

నిజానికి వాళ్ళిద్దరూ పట్టుబడితే, సుఖపడేది తను.

తిన్న టిఫినుకు, కాఫీకి బిల్లు చెల్లించి, తన గదికి బయలుదేరాడు సింగు.

# 5

గంగు, హేల యెక్కిన లారీ విజయవాడ పొలిమేర చేరేలోపున, అయిదు నిముసాలకోసారి డ్రైవరు హేల వైపు చూడసాగాడు.

తెరమీద తను చూసిన హేల ఇలా అర్ధరాత్రప్పుడు,

ఎవడో ఒక అనామకుడి వెంట బయలుదేరి వస్తూండడం డ్రైవర్ని ఆశ్చర్యపరిచింది.

అడిగి తెలుసుకుందామంటే, ఏమనుకుంటారో అని సందేహంతో నలిగిపోయాడు, విజయవాడ చేరుకునేంత వరకూ.

అయితే, విజయవాడ సమీపిస్తుండగా లారీ ఆపి గంగు హేలతో దిగుతుంటే "ఆవిడ సినిమాస్టారు హేల కదండీ?" అని అడిగాడు డ్రైవరు ఇహ ఉండబట్టలేక.

గంగు ఇచ్చిన డబ్బులు అందుకున్నాడు డ్రైవరు.

గంగు నెత్తురు గడ్డకట్టుకుపోయింది.

హేలవల్ల తనని డ్రైవరు సులువుగా గుర్తుంచుకుంటాడు.

రేపొద్దున్న పోలీసులు ఆరాతీయడం మొదలుపెడితే, అతడు ముందుకువచ్చి చెప్తాడు తా మెక్కడ దిగిందీ.

అంచేత, ఆమె హేలన్న విషయం అతడి మనస్సులోంచి చెరిగిపోవాలి.

అయితే, ఏంచెయ్యడం? తీవ్రంగా ఆలోచించాడు.

"అబ్బె! ఆవిడ హేలకాదు...ఏవిటీ?...మా ఆవిడ హేలలా అవుపిస్తోందా?" అని "రమా! ఇలా రా! నీ మొహం డ్రైవరుకు చూపించు. నిన్ను సినిమాస్టారు హేల అనుకుంటున్నాడు" అంటూ దూరంగావున్న హేలను పిలిచాడు గంగు.

గంగు ఉద్దేశం అర్థంచేసుకుంది హేల. చీకట్లోంచి వచ్చి, రెండుకళ్ళూ మెల్లపెట్టి, దంతాలమీది మాంసం కనపడేలా, పెదాలుముడిచి నవ్వి "నమస్కారం" అంది కంఠం బొంగురుచేసి.

ఆ వికృతరూపం చూడగానే డ్రైవరుకు మూడురోజుల క్రితం తిన్నదికూడా వాంతి అయ్యేలా అనిపించింది.

నమస్కారానికి ప్రతినమస్కారంచేసి, ఇంజను స్టార్టు చేసి లారీని జోరుగా లాగించాడు.

ప్రమాదం కాస్తంతలో తప్పిపోయినందుకు, గట్టిగా నిట్టూర్చాడు.

కాని, రాబోయ్యే ప్రమాదాల మాటేమిటి?

హేల తన ప్రక్కనున్నంతకాలం తన పేరు వేరేగా పేపర్లలో ఫొటోతోసహా ప్రకటించుకోనక్కర్లేదు.

ఆమెను తేలిగ్గా గుర్తిస్తారు జనం. ఇహ, రంగందార ఇంట్లో జరిగిన దొంగతనం గురించిన వార్త పేపర్లలో చూస్తే తమను అతిసులువుగా పోలీసులకు పట్టి ఇచ్చేస్తారు.

ఆ ప్రమాదం తప్పించుకోవాలంటే, ఆమెను తన సమక్షంనుంచి శాశ్వతంగా తొలగించి వెయ్యడం ఒక మార్గం.

కాని, తను హత్యలు చెయ్యలేడు. రక్తం, శవం అంటే తనకు వణుకు, భయం.

ఐతే ఏమిటి దారి? ఆమె హేలగా ఎవరూ గుర్తించకూడదు.

మేకప్పువల్ల లాభంలేదు. ఏక్షణంలోనైనా మేకప్పు చెరిగిపోయి, గుట్టు బయటపడే ప్రమాదంవుంది.

తీవ్రంగా ఆలోచించాడు కాసేపు.

జేబులోంచి చుట్టతీసి వెలిగిస్తుంటే, చక్కని ఆలోచన వచ్చింది.

తన సమయస్ఫూర్తికి ఎంతో గర్వించాడు.

"హేలా!" పిలిచాడు ఆమెను.

మౌనంగా అతని ప్రక్కన నడుస్తున్న హేల "ఏం?" అని అడిగింది.

"ఇవాళనుంచి నీపేరు రమ. మర్చిపోకు. ఎవరడిగినా అదే చెప్పు" అన్నాడు గంగు.

"అలాగే!" అంది హేల.

అయిదు నిముషాలు గడిచాయి.

"చిన్నమాట. దగ్గరకురా."

హేల దగ్గరకు వచ్చింది.

కాలుస్తున్న చుట్ట కుడిచేతితో నోటిలోంచితీసి పట్టుకుని, ఆమెను ఎడంచేత్తో చుట్టేసి తన గుండెకు అదిమి పట్టుకున్నాడు.

సమయం సందర్భం లేకుండా తనమీద గంగుకు కోరిక కలిగినందుకు హేలకు చిన్నగా కోపం వచ్చింది.

ఐనా, నలుగురూ పోయేరోడ్డుమీద, కౌగిలించుకుని ముద్దుపెట్టుకోడానికి మించి ఇంకేం చెయ్యగలడు అతను?

వద్దని అరగంట కొట్లాడుకోవడంకన్నా, రెండు నిముషాలు కళ్ళుమూసుకుని అతన్ని భరించడం నయం.

ఆమె గంగును 'వద్దు' అనలేదు. అతడు ఆమెను ముద్దుపెట్టుకుని వదిలేయడమే తరువాయి.

కళ్ళుమూసుకుని, అతడి ముద్దుకోసం ఎదురుచూస్తోంది హేల. కాని, అనుకోనిది జరిగింది.

హేలను కదలకుండా గట్టిగా నొక్కిపట్టుకుని, చుట్ట ఎర్రగాకాల్చి, ఆమె మొహంమీద రెండుమూడుచోట్ల చురకలు వేసాడు గంగు.

ఉడికిపోయిన చర్మం కలిగించిన బాధతో మెలి తిరిగిపోతూ, పిచ్చిదానిలా కేకలుపెట్టింది హేల.

"నీచుడా! ఏమిటీ పిచ్చిపని. అందాన్నిచూసి అనుభవించాలని వెర్రెత్తిపోయేవాళ్ళను చూసానుగాని, వికృతంచేసి ఆనందించే నీలాంటి వాళ్ళను చూళ్లేదు" అంటూ గంగును తిట్టింది, కొట్టింది. అతడి చొక్కాను చింపింది.

ఆమెకోపం తగ్గుముఖం పట్టాక, చల్లగా చెప్పాడు

గంగు, అలా చెయ్యడంలో తన ఉద్దేశం ఏమిటో.

"పీకపిసికి కృష్ణలో పారేస్తాడు ఇంకొకడైతే. నేను ఆపని చెయ్యలేదు. సంతోషించు" అన్నాడు గంగు.

"ఇలా నన్ను కొంచెం చంపేకన్నా, అదే నయం" అంది బొబ్బలెక్కిపోయిన మొహం మండుతుంటే.

విజయవాడ ఊరులోకి చేరుకున్నారు. చిన్న హోటల్లో ఓగది తీసుకున్నారు, తామిద్దరూ దంపతులని చెప్పి.

# 6

పదిహేనురోజులు గడిచాయి. రోజూ వార్తాపత్రికలు తిరగేసి చూస్తున్నాడు గంగు. రంగంబొర ఇంటిదోపిడీ గురించిగాని, సింగు డబ్బుతో పట్టుబడినవైనం గురించిగాని వార్తలేదు.

అంటే, సింగు డబ్బుపుచ్చుకుని ఉడాయించాడు ఎక్కడికో- అనుకోసాగాడు గంగు.

పెంబాంబులాంటి ఆడదాన్ని, డబ్బుగా మార్చడానికి ఇబ్బందులు కలిగించే నగల్ని తనకు వదిలి తెలివిగా తనకో కుచ్చులటోపీ తగిలించి జారుకున్నాడు సింగు.

పోలా, తనూ పంచుకోవడానికి, వేలుమాత్రం చేసే నగలు వదిలి, తను ఏభైలక్షలు కొట్టేసాడు.

ప్రతీకారకాంక్షతో మండిపోయాడు గంగు.

తను సింగును నమ్మాడు గట్టిగా. అందుకు ప్రతిఫలం? తను వంచింపబడ్డాడు దారుణంగా.

తనకు తెలివితేటలు లేవు. నిజమే! కాని, పట్టుదల, నిదానం ఉన్నాయి పుష్కలంగా.

సింగు ఇచ్చిన టోకరా తిని తను ఫూరుకోలేడు. అతడు యావద్భారతదేశంలో ఎక్కడున్నా వెదికి పట్టుకుంటాడు. తన వాటా పట్టుకువస్తాడు.

"పోలా! సింగు మనకు టోకరా ఇచ్చి, ఏభైలక్షలు

తన వశం చేసుకున్నాడు," అన్నాడు గంగు హేలతో.

"ఏవేళకీ రాకపోయేసరికి ఆవేళే అనుకున్నాను, సింగు మనల్ని బోల్తాకొట్టించాడని. ఆ మాటంటే నీకు కోపం వస్తుందేమోనని ఊరుకున్నాను" అంది హేల.

"అయితే ఏంచేద్దామంటావ్ ఇహముందు?"

"చేయడానికేముంది? తూర్పుకు తిరిగి ఓ దణ్ణంపెట్టి ఊరుకోవడమే."

"అంత సులువుగా అతన్ని వదిలెయ్యడమే! లాభంలేదు. మనం సింగుకోసం వెతకాలి. అతడ్ని పట్టుకోవాలి. మన వాటా తెచ్చుకోవాలి. అంతేకాదు. నమ్మినవాళ్లను మోసం చేస్తే ఏమవుతుందో గుణపాఠం నేర్పాలి" అన్నాడు గంగు ఆవేశంతో ఊగిపోతూ.

"నీ ఉద్దేశం బాగానేవుంది. కాని, ఎక్కడున్నాడని వెతుకుదాం? ఈ వెదకడంలో మనం పట్టుబడతామేమో ముందది చూడు. నా ఉద్దేశంలో మనకు దొరికిందే ప్రాప్తి అని ఊరుకోవడం మంచిది" గంగును సమాధాన పరచబోయింది హేల.

"అలా లాభంలేదు హేలా... సరేగాని, నువ్వు నాతో ఉండడానికి అభ్యంతరమా?"

"అభ్యంతరమా?... నా కెవరున్నారని నాకేం చాతనవునని నిన్నొదిలిపోయేది? నీతోనే వుంటాను చచ్చేంత వరకూ."

"ఎందుకలా అంటున్నానంటే, సింగును వెతకడంలో నీ సాయం కావాలి. వాడి అలవాట్లు నాకు తెలుసు. అందమైన ఆడవాళ్లన్నా, ఖరీదైనా మద్యాలన్నా మహా మక్కువ వాడికి. ముండల కంపెనీలు అవీ నువ్వు వెతుకు. బార్లు, హోటల్సు, గేంబ్లింగ్ సెంటర్లు నేను వెతుకుతాను. సింగు దొరికేంతవరకూ మనకు విశ్రాంతి లేదు"

చెప్పాడు గంగు.

గట్టిగా నిట్టూర్చి "అలాగే" అంది హేల. ఒక యాతన అంతమైంది. ఇంకోటి ఆరంభమైంది అనుకుంది.

రెండు నెలలు విధివిరామంలేకుండా సింగుకోసం గాలించారు. కాని ఫలితంలేకపోయింది. సింగు జాడ తెలియలేదు.

# 7

అవాళ ఉదయమే గుంటూరు జయలక్ష్మి లాడ్జినుంచి ఏలూరు శివకాశీ లాడ్జికి మకాం మార్చాడు సింగు.

గదిలో సామానుపడేసి, తాళంవేసి, స్టేషనులో పేపరు కొనుక్కొని వద్దామని బయలుదేరాడు.

రోడ్డుమీద నడుస్తుంటే, బ్రతుకు దుర్భరంగా తోచింది సింగుకు.

తన ఉనికి అతిజాగ్రత్తగా కాపాడుకోవడంకోసం బార్లలో తిరగడం మానుకొన్నాడు.

అందుకే బ్రతుకు చాలా వెలితిగా వుందతడికి.

'ఒక్క నాలుగేళ్లు మనస్సు కట్టుకున్నానంటేచాలు, బ్రతుకులో అన్ని ఆనందాలు దోసిళ్లతో జుర్రుకోవచ్చు' సమాధానపడ్డాడు సింగు.

పాతిక గజాల దూరం నడిచాడో లేదో ఎవరో "సార్! సార్!" అంటూ పిలుస్తున్నట్టు విన్పించింది.

తనెవరు పిలుస్తారు? తనెవరు తెలుసు గనుక? ముందుకు సాగిపోయాడు సింగు.

"మిమ్మల్నే సార్! పిలుస్తున్నది" ఆ వ్యక్తి సింగుని అందుకుని, ప్రక్కన నడుస్తూ అన్నాడు.

"ఏం? ఏంపని నాతో?" చిరాకంతా కళ్లలో కనబరుస్తూ అన్నాడు సింగు.

"ఏం లేదుసార్! పలకరిద్దామని. ఈవాళ ఉదయం

జయలక్ష్మీలాడ్జి గుంటూరునుంచి శివకాశీ లాడ్జి ఏలూరుకు వచ్చేరుకదూ?" అన్నాడా వ్యక్తి.

సింగు తుళ్ళిపడ్డాడు.

వీడెవడో గాని, తనగురించెలా తెలుసుకున్నాడు? పని గట్టుకుని తన కదలికల్ని పరీక్షిస్తున్నాడా? లేక, ఏదో కాకతాళీయంగా తనను రెండుచోట్ల చూడ్డం జరిగిందా?

తనగురించి వీడికేమాత్రం తెలుసునో కనుక్కోవాలి చాతుర్యంగా.

తన మొహంమీదకు చప్పున చిరునవ్వు తెచ్చుకుని "ఆఁ...మీరెంత సేపయింది ఏలూరు వచ్చి?" అడిగాడు సింగు.

"నేనూ మీరొచ్చిన బస్సులోనే వచ్చానులెండి" అన్నాడు ఆవ్యక్తి.

"ఆఁ...మీ పేరేమిటన్నారు? నన్ను సింగు అంటారు లెండి...వ్యాపారం పెడదామనుకుంటున్నాను. ఏవూరైతే బావుంటుందో అని చూస్తున్నాను."

"నా పేరు పాపారావులెండి. రెండునెల్ల క్రితం తెనాలి నవకేతన్ లాడ్జిలో బసచేసారు కదూ?"

సింగు గుండెలో బాంబు పేలింది. వీడికి తన గురించి బాగా తెలుసునులాగుంది!

లాభంలేదు! వీడిగురించి తను క్షుణ్ణంగా తెలుసుకుని తీరాలి!

"కహాఁ పాపారావ్ జీ! హోటలుకెళ్ళాం పదండి" అని పాపారావు భుజంచుట్టూ చెయ్యివేసి, అతన్ని హోటలుకు లాక్కుపోయాడు సింగు.

బయట టేబిల్స్ ఖాళీగావున్నా, ఎయిర్ కండిషన్డు గదిలోకి తీసుకెళ్ళాడు పాపారావుని.

రెండు స్వీట్లు, రెండు హాట్సు తెప్పించి తిన్నాక

కాఫీ త్రాగుతూ "మీ రేదైనా కంపెనీకి రిప్రెజెంటేటివా?" అడిగాడు సింగు.

ఆ ప్రశ్న విన్న పాపారావు మొహంమీద చిరునవ్వు మొలిచింది.

కాఫీ కప్పులోని ఆఖరిగుక్క కాఫీ త్రాగుతూ "కాదండి. నా వృత్తి" అని ఓ క్షణం ఆగి, సింగు కళ్ళల్లోకి తమాషాగా చూసి నవ్వుతూ "భయపడే వాళ్ళను చూసి భయపెట్టడం. డబ్బులు గుంజుకోవడం" అన్నాడు పాపారావు.

సింగు మొహం కళావిహీనమైంది.

తను భయపడుతున్నదంతా అయింది. తను ఓ బ్లాక్ మెయిలర్ చేతిలో చిక్కుకున్నాడు.

తన మొహంలోని భావాల్ని తుడిచేసుకుని, అమాయకంగా "అంటే?" అని అన్నాడు సింగు.

పాపారావు చిన్నగా నవ్వుతూ "మిస్టర్ సింగ్! ఎందుకంతా అమాయకత్వం నటించడం?... ఇహ, మనం వ్యాపారానికి రావడం మంచిది" అన్నాడు.

"ఏమిటి నీ మాటలు? నాకేం అర్థంకావడంలేదు. వ్యాపారం ఏమిటి? మనం మాట్లాడుకోవడమేమిటి?" అన్నాడు సింగు మొహంలో ఆశ్చర్యం కనబరుస్తూ.

సింగు బుకాయింపుచూసి విరగబడి నవ్వాడు పాపారావు.

నవ్వుతున్న పాపారావును చూస్తుంటే, సింగుకు అతడ్ని ఉన్నపళంగా పొడిచి పారేయాలన్నంతకోపం వచ్చింది.

కాని, ఏంచెయ్యగలడు? పరిస్థితులకు తలవంచాలి మరి!

"ఒకామె ముమ్మూర్తులా సినిమానటి హేమలలా వుంటుంది. కాని ఆమె పేరు రమ. ఆమెతోపాటుగ ఓ వ్యక్తి వున్నాడు. అతని పేరు గంగు. వాళ్ళిద్దరూ నీకోసం

వెతుకుతున్నారు ఆంధ్రదేశమంతటా. కాని, వాళ్ళను తప్పించుకుని తిరుగుతున్నావు నువ్వు. వ్యాపారం పెట్టే వాడవయితే, ప్రతీఊరూ అనవాయితీగా రెండేసి నెల్లు చొప్పున వుండి సంచారం చెయ్యవు...వాళ్ళకి నీ ఉనికి నేను తెలియచెయ్యకుండా వుండాలంటే...కొంత పారి తోషికం ఇవ్వాల్సి వుంటుంది నాకు," అంటూ సింగు మొహంలోని భావాల్ని పరిశీలించసాగాడు పాపారావు.

సింగునాలిక పిడచగట్టుకుపోయింది. మతిపోయినట్టుగా దిక్కులుచూస్తూ వుండిపోయాడు.

తనగురించి తెలియవలసిందంతా పాపారావుకు తెలుసు!

రెండునిముషాల తర్వాత పాపారావు పలకరించేంత వరకూ ఈ లోకంలోకి రాలేదు సింగు.

పొదుగులోని పాలు అయిపోయేంతవరకు, పాలుదీసే వాడు ఊరుకోనట్టే, బ్లాక్ మెయిలర్, తను పట్టిన వ్యక్తి దగ్గరవున్న చివరిపైసాకూడా లాగేసేంతవరకూ ఊరుకోడు.

అంటే, త్వరలో తను ఖాళీ అయిపోతాడు.

"ఓకే! మిస్టర్ పాపారావ్! చెప్పు నీ ధర ఎంత?" అడిగాడు సింగు నేలచూపులు చూస్తూ.

తన కళ్ళల్లో ఉన్న ఆరాటంచూసి పాపారావు పెద్ద మొత్తం అడగకుండా ఉండాలని సింగు నేలచూపులు చూస్తున్నాడు.

"టూ తౌజండ్!" చెప్పాడు పాపారావు.

ఓస్! ఇంతేనా! ఇంకెంతో అడిగి తనని పిండిపారేస్తాడని తను భయపడ్డాడు అనవసరంగా. ఆమాత్రం అయితే ఏభైలక్షల్లో కానీ కదపక్కరలేదు.

"వెల్! మిస్టర్ పాపారావ్! నువ్వడిగిన మొత్తం ఇస్తాను. కాని నావి రెండుషరతులున్నాయి. వాటికొప్పుకుంటేనే మొత్తం అంతా ఇచ్చేది."

"ఏమిటా షరతులు?" అడిగాడు పాపారావు.

అతడి మొహంలో ఆనందం వెల్లివిరుస్తోంది. బహుశా తను కోరిన ముత్తం అందబోతోందని కాబోలు!

"ఒకటి. ఇదే నా మొదటి, ఆఖరి పేమెంటు. మళ్ళా గాని, డబ్బుకోసం—ఈసాకుమీద అవుపించావా, నీ శవం ఏ కాలవలోనో, చెరువులోనో, తేలుతుంది మర్నాడే. రెండు, గంగు, రమ తాలూకు వివరాలు నాకు ఎప్పటి కప్పుడు తెలియజేస్తూ వుండాలి. ఈ సర్వీసుకు కొంత డబ్బిస్తాను. ఇష్టమేనా?"

పాపారావు కళ్ళల్లోకి చూస్తూ ఆగాడు సింగు.

బ్లాక్ మెయిలింగ్ ద్వారా, పాతికా పరకా తప్ప పెద్ద మొత్తాలు సంపాయించి ఎరుగడు పాపారావు. అలాంటిది ఒక్కసారిగా రెండువేల రూపాయలు దొరుకుతుంటే, లాటరీలో లక్షలొచ్చినంత ఆనందంగావుంది అతడికి. పైగా తనను సర్వీసులో ఉంచుకుని, అప్పుడప్పుడు కొంత ముట్టచెబుతా నంటున్నాడు ప్రతిఫలంగా సింగు.

ఉదయం లేచాక, తను ఎవరి మొహం చూసాడో గాని, పట్టిందల్లా బంగారమవుతోంది తనకు.

"చెప్పు పాపారావ్! సమ్మతమేనా?" అడిగాడు సింగు ఆత్రంగా.

"కాని... కాని" నసిగాడు పాపారావు.

"ఎందుకు సందేహిస్తున్నావ్?"

"దారి ఖర్చులకు ఇవ్వకుండా నా కిచ్చే కమిషన్లోనే అంతా చూసుకోమంటే యెలా?"

"ఓస్! అదా? అలాగేకాని... గంగు, రమమీద కన్నేసి వుంచు... వాళ్ళగురించి ఎప్పటికప్పుడు చెప్తూండు... అలా గేనా?"

"అలాగే!"

"అయితే, సాయంకాలం అరింటికి ఇక్కడికే రా! డబ్బు పట్టుకెళ్ళు" అన్నాడు సింగు లేస్తూ.

## 8

గత పదిరోజులుగా తన వెనగో వెంబడిస్తున్నారని అను మానం వేస్తోంది గంగుకు.

తను ఎక్కడికెళ్ళినా, ఒకాయన కనిపిస్తున్నాడు తన చుట్టుప్రక్కల.

అది కాకతాళీయమో, ఉద్దేశపూర్వకంగా జరుగు తోందో తనకు అర్థంగాకుండావుంది.

తక్షణం ఆ సంగతి తేల్చుకోవాలి అనుకున్నాడు గంగు.

అవాళ ఉదయం పదిగంటలకు బట్టలకోసం షాపుకు వెళితే, షాపుకు పది అడుగుల దూరంలోవున్న పళ్ళ కొట్టులో పళ్ళుకొంటూ కన్పించాడు ఆ వ్యక్తి.

ఆ తరువాత సినిమాహాల్లోకి వెళ్ళాడు గంగు. కొత్త సినిమాలు ఏవి రాబోతున్నాయో తెల్సుకోవాలని.

ఆ వ్యక్తి అక్కడకూడా తయారయ్యాడు, తనలాగే స్టిల్స్ చూస్తూ.

ఎక్కువసేపు హాలుదగ్గర గడపకుండా గబగబా బయట కొచ్చి. ఊర్వశీ హోటల్లోకి దూరాడు. స్పెషల్ రూంలోకి పోయి కాఫీకి ఆర్డరిచ్చి, త్రాగాక, అరగంట పేపరు చూస్తున్నట్టు వుండిపోయాడు.

తరువాత బయటికొచ్చి చూస్తే, ఆ వ్యక్తి దూరంగా వున్న కిళ్ళీకొట్టువద్ద కూచుని సిగరెట్టు కాలుస్తూ, గేటు మీద చూపులు నిలిపి ఎదురుచూస్తున్నాడు తనకోసం.

అవును! అతడు తనను వెంబడిస్తున్నాడు. తన కదలి కల్ని నిశితంగా పరిశీలిస్తున్నాడు.

అయితే, అతడి ఉద్దేశం ఏమిటి?

అతడు రంగందొర మనిషా? సింగు ఏజంటా? లేక బ్లాక్ మెయిలరా?

పోలీసులేకాదు, అసలు రంగందొర వచ్చినా, గుర్తుపట్టే స్థితిలోలేవు తనవద్దవున్న నగలు. ఆ నగల తాలూకు బంగారం చాలామట్టుకు అమ్మేసాడు. కొద్దిరోజులుపోతే, ఆ పాళ్లు అమ్ముకోవాలి.

కాని, వాటిని చూస్తుంటే, ఆ పాళ్ళన్నింటికీ వంద రూపాయలయినా వస్తాయా అనిపిస్తుంది.

ఎవరూ చూడకుండా, వాటిని ఓ రోజు సైడుకాలవలోకి విసిరెయ్యాలి!

ఏది ఏమైనా, వాడెవరో తను తెలుసుకుని తీరాలి. అందుకు దండప్రయోగం ఒక్కటే మార్గం!

ఏం చెయ్యాలో బాగా ఆలోచించాడు.

జైలు రోడ్డువైపుకు దారితీసాడు. ఆవ్యక్తికూడా అతన్ని అనుసరించసాగాడు. కనుకొసల్లోంచి గంగు అతడ్ని గమనిస్తున్నాడు.

జైలుదాటాక, పెద్ద మైదానం వచ్చింది. మైదానానికి అడ్డంగా నడవసాగాడు గంగు.

ఆ వ్యక్తికూడా మైదానంలోకి దిగాడు.

మైదానానికి ఎడంప్రక్కగా జైలుకు సంబంధించిన ఓ పాడుబడిన ఇల్లొకటివుంది. దాన్ని చూడగానే, ఓ ఆలోచన వచ్చింది గంగుకు.

చకచకా అడుగులేసుకుంటూ ఆ ఇంట్లోకి దూరాడు గంగు. కాసేపు గోడలవెనుకన నక్కినాసాడు.

ఆ వ్యక్తికూడా లోన జొరబడ్డాడు.

వహ్వా! ఎలుక బోనులోపడింది!!

చప్పున వెనుకవైపునుంచి, ఇంటిముంగలకువచ్చి, గభాలున తలుపులు బిగించి గొళ్లెం తగిలించాడు.

మళ్ళా క్షణం ఆలస్యం చెయ్యకుండా, ఇంటివెనుక వైపుకు పరుగెత్తాడు గంగు.

ఆ క్షణంలో గంగు వెళ్ళకపోయుంటే, ఆ వ్యక్తి బయటకు ఉరికేసేవాడే!

ఎదురుబడిన గంగును చూసి, ఆ వ్యక్తి నిశ్చేష్ఠపోయాడు. కోపంతో ఎరుపెక్కిన గంగకళ్ళు చూసి ఆ వ్యక్తి భయంతో వెనక్కి రెండడుగులు వేశాడు.

భీకరంగా ఆవ్యక్తి కళ్ళల్లోకి చూస్తూ, ఆ వ్యక్తికాలరు పట్టుకుని గట్టిగా ఊపి "ఎవర్రా నువ్వు? ఎందుకు నా వెనుకబడ్డావ్?" అని అడిగాడు గంగు.

ఆ వ్యక్తి మాట్లాడలేదు. గుటకలు మింగుతూ, కళ్ళప్పగించి ఊరుకుండిపోయాడు.

"ఏంరా? మాట్లాడవేం?" అంటూ సాచి రెండు కొట్టాడు ఆ వ్యక్తిని.

కళ్ళు జిగ్గుమన్నాయి ఆ వ్యక్తికి. ఒక్కక్షణం కళ్లు బాధగా మూసుకున్నాడు.

"చెప్పు! ఇప్పుడు కొట్టినవి మచ్చుకుమాత్రమే. ఈసారి కొట్టానంటే నెత్తురే చూస్తావు" అన్నాడు గంగు అతడ్ని ఊపిపారేస్తూ.

"పొరబాటయిపోయింది. క్షమించండి. ఇంకెప్పుడూ మీ వెంటబడను. నన్ను వదిలెయ్యండి ఈసారికి" బ్రతిమాలుకుంటున్నట్టుగా అన్నాడా వ్యక్తి.

"అదేం కుదరదు చెప్పు. నువ్వెవరవు? ఎందుకు నన్ను వెంబడిస్తున్నావు?"

ఆ వ్యక్తిని వదలలేదు గంగు. పైగా పట్టు బిగించాడు.

"నాపేరు పాపారావు. జేబులుకొట్టడం నావృత్తి. అందుకే మీ వెంటబడ్డాను" అబద్ధం ఆడాడు ఆవ్యక్తి.

గంగు ఓ నిముషం ఆలోచించాడు. పాపారావు

చెప్పింది అసత్యమనిపించింది అతడికి.

"జేబు కొట్టాలనికాదు నువ్వు చూస్తున్నది. ఎందుకో నా వెంటబడ్డావు. చెప్పు" గద్దించి అడిగాడు గంగు.

పాపారావు బదులివ్వలేదు.

గంగు తన పిడికిలి బిగించి, రెండు పొట్టలోను, మరి రెండు దవడమీద కొట్టాడు.

"అమ్మా!" పెద్ద కేక పెట్టి, బాధతో మెలితిరిగిపోతూ నేలమీద పడిపోయాడు పాపారావు.

అంతటితో ఊరుకోలేదు గంగు. పాపారావు నడ్డిమీద కాలి ముడుకులమీద, బూటుకాళ్లతో సత్తువకొద్దీ తన్నాడు.

ఆ క్షణంతో తన ప్రాణాలు కడబట్టి పోయాయను కున్నాడు పాపారావు.

నరాల్ని తెంపుతున్నట్టుగా, కండలు కోస్తున్నట్టుగా వుంది ఒంట్లో బాధ.

"ఆగండి. కొట్టకండి. కొట్టకండి. చెప్తాను" చేతులు జోడించి పాపారావు వేడుకోగానే, అతన్ని ఇంకా తన్నాలని ఎత్తిన తన బూటుకాలు దించేసాడు గంగు.

"మీ యావిడ రమలేదూ!...ఆమెను కామించాను. మీరు ఇంటిదగ్గర లేనిసమయం ఏదో తెలుసుకుందామని మీ వెంటబడ్డాను" పాపారావు మళ్ళీ అబద్ధం ఆడిచూసాడు గంగు నమ్ముతాడేమోనని.

పాపారావు మాట వింటూనే, అది అబద్ధమని చప్పున గ్రహించాడు గంగు. కాలెత్తి పాపారావు ముహంమీద తన్నాడు.

పాపారావు నోరు, ముక్కు పగిలి నెత్తురు కార సాగింది.

"స్కౌండ్రల్! చావుదెబ్బలు తింటూకూడా ఇంకా అబద్ధం చెప్తున్నావా?" అంటూ మళ్ళా కాలెత్తాడు.

గంగు, పాపారావును తన్నడానికి.

"బాబోయ్! తన్నకండి. చెప్పేస్తాను. సింగు మిమ్మల్ని వెంటాడి మీగురించి చెప్పమన్నాడు" అన్నాడు పాపారావు.

పాపారావు జన్మలో అంత గట్టిగా దెబ్బలు ఎన్నడూ తినలేదు. ముఖ్యంగా నెత్తురు కారేటట్లు అసలు దెబ్బలు ఎరుగడు. అప్పటికీ రెండుసార్లు అబద్ధాలు చెప్పి సింగును ఏమార్చుదామనుకున్నాడు. కాని, అతని మాటలు గంగు నమ్మలేదు.

చివరకు పాపారావు నిజం చెప్పక తప్పలేదు.

సింగు పేరు చెవిన పడేసరికి, గంగుగుండెలో మువ్వలు మ్రోగాయి.

క్రిందపడి బాధతో మూలుగుతూ దొర్లుతున్న పాపారావు చొక్కా పట్టుకుని పైకి లేవనెత్తి "చెప్పు! వాడెక్కడున్నాడు?" అన్నాడు గంగు.

"బాబ్బాబు! ఆ విషయంమాత్రం అడగకండి. నేను అది చెపితే నాకు చావు తప్పదు. ఇహముందు మాత్రం మీ వెంటబడను" అన్నాడు పాపారావు చేతులు జోడించి గంగు పాదాలమీద పడబోతూ.

"చెప్పకపోతే నేను చంపుతాను. చెప్పు! సింగు ఎక్కడ" అరిచాడు గంగు.

"బాబ్బాబు! నన్ను వదిలెయ్యండి. డబ్బుకాసపడి, మిమ్మల్ని వెంటాడి మీగురించి చెప్తానన్నాను" అన్నాడు పాపారావు ఏడుస్తూ.

"లాభంలేదు. చెప్పాల్సిందే. లేదా, ఇందాకటిలా తగుల్తాయి" అన్నాడు గంగు, పిడికిలి ఎత్తికొట్టబోవడానికి సిద్ధమవుతూ.

"వద్దు! వద్దు! కొట్టొద్దు!...ఏలూరు శివకాశీ లాడ్జీలో

ఉన్నాడు" చెప్పేసాడు పాపారావు.

# 9

ఒంటిగంట అవుతుండగా సింగు బయటకు వచ్చాడు, తన గదికి తాళంవేసి. అతని చేతిలో ఓ సంచీ వుంది.

పుచ్చ పువ్వులా కాస్తున్న వెన్నెల్లో తల వంచుకుని తొందరగా అడుగులేసుకుంటూ నడచి వెళ్లిపోతున్న సింగును పోల్చుకున్నాడు గంగు.

అతడ్ని అనుసరించసాగాడు.

ఊరి పొలిమేర దాటాక సింగు రోడ్డు వదిలేసి నాటు త్రోవ పట్టాడు.

అలా వెళ్లిన సింగు, ఓ మర్రిచెట్టు సమీపంలో ఉన్న నూకాలమ్మ గుడివద్ద ఆగాడు.

తననెవరూ గమనించడం లేదని నిర్ధారణ చేసుకోవ డానికి నలుప్రక్కలా చూసాడు.

చుట్టుప్రక్కల మనుష్య మాత్రుడెవడూ లేడని అని పించగానే, గుడిలో ప్రవేశించాడు సింగు.

నిశ్శబ్దంగా గుడి వెనుక భాగంనుంచి గుడివద్దకు నడి చాడు గంగు.

గుడిలోంచి నేలను త్రవ్వుతున్న శబ్దం వినవచ్చింది.

గంగుకు ఇప్పుడు అర్థమయింది, సింగు ఆ గుడికి ఎందుకు వచ్చాడో.

ఎప్పుడో జాతర్లప్పుడు తప్ప, వూరికి దూరంగా విసిరేసి నట్టున్న ఆ గుడికి యెవరూ రారు.

ఆ సంగతి తెలిసిన సింగు, తన డబ్బున్న సూట్ కేసు, ఆ గుడిలో నేలలో విగ్రహంక్రింద పాతిపెట్టాడు.

తన గురించి పాపారావు చెప్పి వుంటాడు.

ఇప్పుడు ఆ పెట్టె తీసుకుని ఎక్కడికో పారిపోవాలని

సింగు ప్లాను.

త్రవ్వడం పూర్తయినట్టుంది. కాసేపు నిశ్శబ్దం అలుము కుంది అంతటా.

పావుగంట గడిచాక, సింగు బయటకొచ్చాడు. ఒక చేతిలో సూట్ కేస్, రెండో చేతిలో, ఇందాక తనతో తీసుకెళ్లిన సంచీ ఉన్నాయి.

"ఆగక్కడ?" గంగు గర్జించాడు.

ఆ మాటలు తుపాకీ గుళ్ళల్లా మోగాయి సింగు చెవుల్లో.

స్థాణువులా నిలుచుండిపోయాడు.

గంగు, సింగుకు ఎదురుగా వచ్చి నిలుచున్నాడు.

గంగును చూడగానే నిలువెల్లా వణికిపోయాడు సింగు.

ఆ యేభై లక్షలకోసం తను పెద్ద పథకం వేసాడు.

తన శ్రమంతా వృధా కావాల్సిందేనా? ఇప్పుడు వాడికి తను వాటా ఇవ్వాలా? ఇందుకోసమేనా, తను ఇన్ని ఇబ్బందులు పడ్డది? ఇన్ని ఎత్తులు వేసి తప్పించు కున్నది?

లాభం లేదు. గంగుకు తను చిల్లిగవ్వ ఇవ్వబోయేది లేదు.

"గంగూ!" కోపంగా అరిచాడు సింగు.

"యేం?"

"ఈ యేభై లక్షల్లో నీకు ఒక్క పైసా ఇవ్వను."

"యేం? ఎందుకివ్వవు?"

"అంతే! ఇవ్వను. ఈ డబ్బుకోసం అనవసరంగా ఆశ పడక."

"లేదు! వాటా ఇవ్వాల్సిందే. లేదా, అంతా నేనే యెత్తుకుపోతాను."

"గంగూ! నీకు కండబలం వుందని ధీమాగా వుంది

కాబోలు. తలుపులుమూసి, పిల్లిని గదిలో బంధించి కొట్ట బోతే యేం జరుగుతుందో తెలుసునా? కళ్ళు పీకేస్తుంది. మొహం రక్కేస్తుంది. ఎగిరి గొంతుక పట్టుకుని, పీకముడి కొరికేయవచ్చు. జాగ్రత్త! హెచ్చరిస్తున్నాను."

"ఓహో! అంత ధైర్యం వచ్చేసిందేమిటి! కాని, నువ్వేం జెయ్యలేవు నన్ను" అంటూ సింగు చేతిలో ఉన్న సూట్ కేస్ అందుకోవడానికి చప్పున వంగాడు గంగు.

అది చూసిన సింగు క్షణం ఆలస్యం చెయ్యకుండా, తన కుడిచెయ్యి వెనక్కి లాక్కోవడమే గాకుండా, ఎడం చేతిలో ఉన్న సంచీతో గంగు మొహంమీద కొట్టాడు గట్టిగా.

సంచీలో ఇనపసామానులున్నాయేమో, దెబ్బ బాగా తగిలింది గంగుకు.

దబ్బున నేలమీద పడిపోయాడు "అమ్మో!" అని అరుస్తూ.

దెబ్బ తగిలినచోట చేత్తో తడిమి చూసుకున్నాడు. చర్మం చిట్లింది. వెచ్చని నెత్తురు చేతికి తగిలింది.

రక్తం కళ్ళ జూడగానే, గంగు పిచ్చివాడయి పోయాడు.

"ఒరేయ్! సింగూ. నన్ను కొడ్తావురా. చూడు నిన్నేం చేస్తానో," అంటూ ఒక్క వూపున లేచాడు గంగు, సింగును పట్టుకోవాలని.

సింగు పరుగు లంకించుకున్నాడు. గంగు అతడి వెంట బడ్డాడు.

సింగుది తేలికైన శరీరం. గాలిలో తేలిపోతున్నట్టు తేలిగ్గా పరుగుదీస్తున్నాడు.

గంగుది భారీ శరీరం. పరుగు పెట్టడం కష్టంగా ఉందతడికి.

పాంవుగంటలో ఆయాసం ఎగదన్నుకు వచ్చింది.

గంగు తన లోపం అర్థంచేసుకున్నాడు. తీవ్రంగా ఆలోచించాడు. మెరుపులాఓక ఆలోచన వచ్చింది.

నేలమీదకు వంగాడు. తొందరగా, నాలుగయిదు రాళ్ళు ఏరాడు.

పరుగుతీస్తున్న సింగును చూసి జాగ్రత్తగా గురిపెట్టి రాళ్ళు విసిరాడు.

వాటిలో రెండు తప్పిపోయినా, ఒకటి అతడ్ని అందుకుంది.

"అమ్మా!" అంటూ గట్టిగా అరిచి నేలమీద పడిపోయాడు సింగు.

ఆ పడిపోవడంలో, చేతిలో పెట్టె, సంచీ జారిపోయాయి. సంచీలోంచి, చేతి గునపం వగైరా ఇనప సామాను బయటికి వచ్చేసాయి.

రెండు నిముషాల్లో గంగు అతడ్ని చేరుకొన్నాడు.

అతడి కంటికి అవుపించిన చేతి గునపం అందుకుని, సింగు గుండెల్లో పొడిచాడు, రెచ్చిన ఆవేశంతో.

"అమ్మా!" అంటూ పెద్ద పెట్టున కేక పెట్టి కాసేపు కాళ్ళు చేతులూ కొట్టుకుని, ప్రాణాలు వదిలాడు సింగు.

అప్పటికిగాని తనేం చేసాడో అర్థంకాలేదు గంగుకి.

నెత్తురు, శవం చూసి గడగడా వణికిపోయాడు.

ఇహ ఒక్క క్షణం అక్కడ ఉండడం ప్రమాదం అని గ్రహించి, పెట్టె అందుకొని గోడ్డుమీదకు పరుగుదీసాడు.

# 10

తిన్నగా హేల, తనూ ఉంటున్న గదికి వచ్చాడు గంగు.

హేలకు జరిగినదంతా చెప్పి, వెంటనే బయలుదేరా లన్నాడు. తన బట్టలన్నీ చిన్న పెట్టెలోకి సర్దుకున్నాడు.

రెండు వీధుల కవతల ఉన్న ఇంటి యజమానికద్దకు వెళ్ళాడు. అద్దె పూర్తిగా చెల్లించాడు. గదిలో మిగిలివున్న కుర్చీలు వగైరా సామాను ఇంటాయన్ను తీసుకోమని చెప్పాడు.

అక్కడ్నుంచి రైల్వేస్టేషనుకు దారితీసాడు హేలతో,

నడుస్తుంటే త్రోవలో స్టేట్ బేంక్ అవుపించింది. రెండువందల రూపాయలకు చిల్లరనోట్లు తీసుకోవాలనిపించింది అతడికి.

లోనికి వెళ్ళాడు. కేషియర్ వద్దకుపోయి, రెండు వంద రూపాయల నోట్లు అందించి, చిల్లర ఇమ్మని అర్థించాడు.

కేషియర్ ఓ క్షణం నోట్లవైపు చూసి, గంగువైపు చూశాడు.

"మీకు ఏ నోట్లు కావాలి?" అడిగాడు కేషియర్.

"ఒకట్లు ఇస్తే చాలా మంచిది," చెప్పాడు గంగు.

"తెస్తానుండండి."

లోనికెళ్ళాడు కాషియర్. తన కేష్ కౌంటరుకు తాళం వేసి.

ఐదునిముషాలు పోయాక తిరిగొచ్చాడు కేషియర్. "అలా కూచోండి. ఒకట్లు స్టాకులేదు. స్ట్రాంగ్ రూం లోంచి డబ్బు తీస్తున్నారు. అవగానే ఇస్తాను" అన్నాడు.

"థేంక్స్!" అంటూ సమీపంలో ఉన్న కుర్చీలో కూచున్నాడు గంగు. చేతుల్లోని పెట్టెల్ని నేలమీద వుంచి. హేల విసుగ్గా మరో కుర్చీలో కూర్చుంది.

సావుగంట గడిచింది.

పదిమంది పోలీసులు, ఒక సబిన్స్పెక్టర్ ఉన్న పోలీసు వేను బేంకు ముందు ఆగింది.

వాళ్ళను చూడగానే, గంగు, హేల కాస్త కంగారు పడ్డారు.

అదేసమయంలో కేషియర్ బయటికి వచ్చాడు. "వీళ్ళేనండీ! ఆ దొంగనోట్లు ఇచ్చింది" గంగు, హేలవైపు చూపించి అన్నాడు.

"నా వేమిటి? దొంగనోట్లేమిటి?" గంగు ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే, పోలీసులు అతడ్ని చెక్ చేసి, జేబులోంచి నోట్లకట్ట బయటకు లాగారు.

ఆ తరువాత పెట్టెను తెరిపించి "ఇంత మొత్తం యెక్కడ్నుంచి వచ్చింది?" మొదలైన ప్రశ్నలు వేసి, ఎలాంటి జవాబు గంగు, హేలలనుంచి రాకపోయేసరికి, ఇద్దరినీ అరెస్టు చేసి తీసుకెళ్ళారు పోలీసులు.

ఆ క్షణంవరకూ గంగుకు తెలీని విషయం ఒకటుంది. రంగంగారికి చిత్ర నిర్మాణమే కాకుండా, దొంగనోట్ల వ్యాపారం కూడా ఉంది.

ఆ డబ్బే గంగు, సింగులకు దొరికింది. అవి దొంగనోట్లు కాబట్టే, కిక్కురుమనకుండా, డబ్బు పోయినప్పటికీ పోలీసు రిపోర్టు ఇవ్వలేదు రంగంగారు. అది తెలియక గంగు, సింగు, హేలలు తిన్నగా సాలెగూటిలో చిక్కుకున్నారు.

—:ఐపోయింది:—

# భూతాల బంట్లు

సుజనశ్రీ

"గుడ్ మార్నింగ్ బ్యూటీ!" అన్నాడు నరేంద్రకుమార్ చిన్నగా నవ్వుతూ.

తను రాస్తున్న పేపరులోంచి దృష్టి మరల్చి టేబుల్ దగ్గర నిలబడి తనను విష్ చేసిన వ్యక్తివంక చిరుకోపంగా చూసింది రిసెప్షనిస్ట్ జెట్టీ.

"ఓ.! గుడ్ మార్నింగ్! దయచేసి కుర్చీలో కూర్చోండి! తమకే విధంగా సహాయం చేయగలను నేను?"

"ఇప్పుడు రిసెప్షనిస్టు వనిపించుకున్నావ్! నేను వచ్చిన పనేమిటంటే_ నేను వెంటనే బాస్‌ని చూడాలి."

"ఆయనేదో ఫైలు చూస్తున్నాడు. అరగంటవరకూ తనను డిస్టర్బ్ చెయ్యొద్దని ఆర్డర్."

"ఆయన నా మాట చెప్పి కనీసం రెండుగంటలు గడిచి ఉంటాయ్."

"ప్చ్! మీ ఇన్వెస్టిగేషన్ మనుషులతో వేగడం కష్టం! కోడిగుడ్డుమీద ఈకలు పీకుదామని చూసే రకాలు" అంటూ ఇంటర్‌కమ్ స్విచ్ నొక్కిందిం.

"ఎస్!" అని కంఠం మారుమ్రోగింది.

"గుడ్ మార్నింగ్ బాస్! మిస్టర్ నరేంద్రకుమార్ మీకోసం వెయిట్ చేస్తున్నారు."

"ఆల్ రైట్! అతన్ని లోపలకు పంపు!"

నరేంద్రకుమార్ తనమాటే నెగ్గిందన్న ధీమాగా కుర్చీ లోంచి లేచి నిలబడ్డాడు. నెక్ టై సవరించుకున్నాడు. తనవంకే ఆప్యాయంగా చూస్తున్న బెట్టీ-మాపుల్ని తప్పు కుని డైరక్టర్ గది తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళాడు.

"గుడ్ మార్నింగ్ సర్!" అని వినయంగా విష్ చేశాడు.

"మార్నింగ్! కూర్చో నరేంద్రా!"

"థాంక్స్ సార్!" అంటూ డైరక్టరు టేబుల్ దగ్గరకు కుర్చీని లాక్కుని కూర్చున్నాడు.

"నాకు ఇప్పుడో సమస్య వచ్చిపడింది. అనుమానా స్పదులైన ముగ్గురు వ్యక్తులు ఒకే దిక్కులో ప్రయాణించ బోతున్నారు. వాళ్లు కలిసికట్టుగా ఏ దేశానికి ముప్పు తేబోతున్నారో కనిపెట్టి, వీలైతే వాళ్ళ ప్లాన్‌ని భగ్నం చేయాలి."

"ఆపని నాకప్పగించండి సార్!"

సెంట్రల్ ఇంటలిజెన్స్ డైరక్టర్ ఉపేంద్రనాథ్ కుర్చీలోంచి లేచాడు. సిగార్ వెలిగించి కిటికీ దగ్గరకు వెళ్ళి రోడ్డుమీదకు చూస్తూ నిలబడ్డాడు.

అతనివంకే చూస్తున్నాడు నరేంద్రకుమార్. తనకే పని అప్పగించటానికి వెనుకాడుతున్నాడా బాస్! ఎందు

కంటే తను ఆకారంలో ఇంగ్లీషువాడిలా వుంటాడు. పిల్లి కళ్ళు, రాగిరంగులో జుట్టు తెల్లని దేహచ్ఛాయ. వీటితో తను అటు బ్రిటిష్ వాళ్ళలోనూ, ఇటు అమెరికన్ లలోనూ కలిసిపోగలడు.

అయితే ఇప్పుడు తను వెళ్ళబోయే ప్రదేశం ఆ రెండు దేశాలకూ వ్యతిరేకంగానివిగా ఉండాలి. రష్యాను బలపరిచే దేశాల్లో అమెరికా వ్యతిరేకత కనబడుతూవుంటుంది. బ్రిటిష్‌వారికి ఇంకా ఆ స్టేజీ రాలేదు. చాలాకాలం ప్రపంచంలో మూడువంతులు పరిపాలించిన పెద్దరికంవల్ల వాళ్లను ఏదేశంవెళ్లినా మర్యాదగానే చూస్తారు, ఎక్కడో ఆఫ్రికాలోని వలస రాజ్యాల్లో తప్పితే.

ఉపేంద్రనాథ్ సిగార్‌ని ఏష్‌ట్రేలో పడేశాడు, దాన్ని ఆర్పిన తర్వాత.

"ఇంగ్లండు దేశానికి చెందిన షిప్ ఒకటి బంగ్లాదేశ్ తీరాన్ని చేరుకుంటుంది. అది మనదేశంలోని వోడరేవుల్లోకి వచ్చేందుకు పర్మిషన్ లేదు. బంగ్లాదేశ్ లో చిట్టగాంగ్ రేవులో సరుకుల్ని, ప్యాసింజెర్లను ఎక్కించుకుని ఆ వోడ సింహళం చేరుకుంటుంది.

"అందులో ముగ్గురు కీలకమైన వ్యక్తులు ప్రయాణిస్తున్నారు. మొదటివాడు చైనా వ్యాపారస్తుడు. రెండోవాడు మాజీ భారత కల్నల్ ఇంద్రజిత్ పరిషద్. మూడో వ్యక్తి బ్రిటిష్ గూఢచారి డేవిడ్ స్మిత్.

"వీటని గురించిన వివరాలన్నీ ఫైల్‌లో ఉన్నయ్," అంటూ ఉపేంద్రనాథ్ డ్రాయరులాగి, అందులోనుంచి ఒక ఫైల్ లాగి అతనిముందు పడేశాడు.

ఎర్రరంగు ప్యాడ్‌లో కట్టబడివుంది ఆ ఫైల్. పైన "అనుమతిలేనిదే తెరువరాదు" అని రాసి వుంది.

నరేంద్రకుమార్ డైరెక్టరువంకే చూస్తున్నాడు. "నీవు

2.కి క్రోజులో చిట్టగాంగ్ చేరాలి. ఇవాళ్టినుంచి సరిగ్గా మూడోరోజున ఆ బ్రిటిష్ నౌక "విక్టోరియా" చిట్టగాంగ్ తీరాన్ని తాకుతుంది. నీ ప్యాస్‌పోర్టు ఆ ఫైల్‌లోనేవుంది. ఈ జర్నీలో నీ పేరు మైకేల్ స్కాట్. సిలోన్‌లోని టీ ఎస్టేట్‌లో పెద్ద అధికారివి. బంగ్లాదేశ్‌లో టీ వ్యాపారాభివృద్ధిగురించి ప్రయత్నించే నిమిత్తం బంగ్లాదేశ్ వచ్చి మళ్ళీ సిలోన్ వెళ్తున్నావ్. అర్థమయిందా?"

"యస్ సర్!" నరేంద్రకుమార్ తల ఊపాడు.

"నౌ ఓపెన్ ది ఫైల్!"

ఫైల్ తెరచి చూసాడు. అందులో తను కలుసుకోబోయే వ్యక్తుల గతజీవిత చరిత్ర ఉంది. రకరకాల ఫోజుల్లో వివిధ దుస్తుల్లో వాళ్ళ ఫొటోలున్నాయ్. అంటే వాళ్ళు మారువేషంలో ఉన్నా వాళ్ళను తను తేలిగ్గా పోల్చుకోగలడు, ఆ ఫొటోలవల్ల. పదినిముషాల్లో రెండు సార్లు ఫైల్‌ని తిరగేశాడు.

తన ప్యాస్‌పోర్ట్‌ని కోటుజేబులో పెట్టుకున్నాడు. ఫైల్‌ని మూసేసి మళ్ళీ బాస్‌కి అందించాడు. అది మళ్ళీ డ్రాయర్లోకి వెళ్ళిపోయింది.

"బంగ్లాదేశ్‌తో మనకి గల సత్సంబంధాలవల్ల నీవు చిట్టగాంగ్ చేరేవరకూ ఎటువంటి ఆటంకాలూ ఉండవనే అనుకుంటాను. అయినా నీ జాగ్రత్తలో నీవు ఉండాలి. పాకిస్తాన్ గూఢచారులు బంగ్లాదేశ్‌లో ఉండి ఉంటారనే నా అనుమానం. ఎప్పటికప్పుడు సీక్రెట్ కోడ్‌లో మాకు సమాచారం అందజేయి. నౌ విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్."

బాస్‌తో కరచాలనంచేసి బయటకు నడిచాడు నరేంద్రకుమార్.

## 2

ఇంగ్లండ్ దేశానికి చెందిన నౌక విక్టోరియా ఆ పేరుకు

తగట్టుగానే చాలా కాలంనాటిది. పాతబడిపోయింది గూడాను. దాన్ని సింహళదేశపు కోటీశ్వరుడు కొని వ్యాపారనిమిత్తం వాడుకుంటున్నాడు.

తన రూమ్‌లో కూర్చుని హెడ్‌క్వార్టర్స్‌కి సీక్రెట్ కోడ్‌లో మెస్సేజ్ వైర్‌లెస్‌లో చెప్పాడు. దాన్ని మధ్యలో ఎవరన్నా విన్నాగానీ అదేదో టీ వ్యాపారానికి సంబంధించిన వివరాలే వినగలరు కాని దాన్ని డీకోడ్ చేయలేరు.

అతడు గది తలుపుకు తాళంవేసి బార్ వేపుగా నడిచాడు.

బార్ టేబుల్ చుట్టూ స్టూల్స్ వేసుకుని గ్లాసులతో సిప్ చేస్తున్నారు కొందరు ప్రయాణీకులు అప్పటికే.

వారిలో ఒక స్త్రీగూడ ఉంది. మోకాళ్ళవరకూ స్కర్ట్, బాడీక్రిందకు ఉన్న జాకెట్ వేసుకుంది. బాబ్డ్ హెయిర్.

"మీరు చిట్టగాంగ్ రేవులో ఎక్కారనుకుంటాను!" అప్పుడే వచ్చిన వ్యక్తిని చూస్తూ అంది ఆమె.

"అవును! నా పేరు మైకేల్ స్కాట్. సింహళంలో నాకు టీ వ్యాపారం ఉంది. బంగ్లాదేశ్‌లో నా బిజినెస్‌ని ఎలా వ్యాప్తంచేయాలో అక్కడి మార్కెట్‌ని సర్వేచేసి వస్తున్నాను."

"గ్లాడ్ టు మీట్ యూ! నా పేరు అనితా గుణవర్ధనే! నేను సింహళంలో టీచర్ ఉద్యోగానికి వెడుతున్నాను."

స్కాట్ ఆమెని నిశితంగా చూశాడు. లోనెక్ జాకెట్‌లో మామిడి పళ్ళలాగ ఆమె వక్షోజాలు సగం నగ్నంగా బయటకు కనబడుతున్నయ్. ఆమె తరహా చూస్తే మగవాళ్ళని ఊరించి ఊరించి తనవెంట కుక్కల్లా

త్రిప్పుకోవాలనే ఆరాటం గల స్త్రీలా కనుపించింది.

"మీ టీ కంపెనీ పేరు... అదే ఏ బ్రాండ్ టీని సేల్ చేస్తారు?" ఆమె మళ్ళీ అడిగింది.

"విజయ్ టీ! 'జీవితంలో మీరు విజయాన్ని పొందాలంటే విజయ్ టీని సేవించండి' అది మా కంపెనీ స్లోగన్!"

అంతలో అటుగా మరో వ్యక్తి వచ్చాడు. అతడ్ని చూస్తూనే మిగతా వారంతా లేచి నిలబడ్డారు, అనిత మినహా.

స్కాట్ కూడా లేవలేదు. కుర్చీలో కూర్చునే ఆ వచ్చిన చైనీయునివంక చూసాడు. అతడు చాలా లావుగా ఉన్నాడు. మనిషి అయిదున్నర అడుగుల ఎత్తు ఉన్నా, లావుగా ఉండటం మూలాన అతడు పొట్టిగా కనిపిస్తాడు. కళ్ళు ఏనుగు కళ్ళలా చిన్నవి. బుగ్గలు ఎత్తుగా కండబట్టి ఉన్నాయ్. మీసాలు రెండు వేపులా క్రిందకు వ్రేలాడుతున్నాయ్.

"హలో చాంగ్!" అంటూ అనిత పలకరించింది అతడ్ని.

అతడు చిరునవ్వు నవ్వాడు. "ఏం చేస్తున్నావ్ ఇక్కడ?" అని అడిగాడు. తాటాకులు గలగలమన్నట్టుగా ఉంది అతని కంఠం.

"కొలంబోలో టీ కంపెనీకి చెందిన స్కాట్‌తో మాట్లాడుతూన్నాను. ఇంతలోనే మీరు వచ్చారు."

చాంగ్ కుర్చీలో కూర్చున్నాడు. చాంగ్ సొంత నౌకరు ట్రేలో బ్రాందీసీసా, రెండు గ్లాసుల్ని తెచ్చి బల్లమీద వుంచాడు వినమ్రంగా.

"టీ కంపెనీలో పనిచేస్తారా మీరు? ఎస్టేట్ వుందా మీకు?" స్కాట్ కళ్ళలోకి చూస్తూ అడిగాడు చాంగ్.

"అవును. స్వంత ఎస్టేట్ వుంది."

చాంగ్ కనుబొమలు ముడిచి చూశాడు అతనివంక. తర్వాత అనితవంక తినేసేలా చూశాడు చాంగ్.

చాంగ్ లక్షాధికారి అని విన్నాడు తను. అతడు తల్చుకుంటే అనితకన్న అందమైనవాళ్లను అలవోకగా కొనేయగలడు. అయితే ఈమె చాంగ్ తరఫు పనిచేసే గూఢచారిణి కాదుగదా!

చుట్టూ నిలబడి తాగుతున్న వాళ్లనుద్దేశించి "కూర్చోండి మిత్రులారా!" అన్నాడు.

"అన్నట్టు వీరెవరో పరిచయం చేయలేదు!" అనితా గుణవర్ధనేని వుద్దేశించి అడిగాడు మైకేల్ స్కాట్.

"వీరు చాంగ్-యూ-చాంగ్. నవచైనాలో పెద్ద బిజినెస్ మాగ్నెట్. వీరికి రెండు వ్యాపారనౌకలు స్వంతం వున్నాయ్. ఇంకా బియ్యం వ్యాపారం, టీ, నూలువస్త్రాలు ఇలాంటి చిల్లర వ్యాపారాలు ఎన్నివున్నాయో ఆయనకే తెలియదు."

స్కాట్ మరో వ్యక్తి వంక చూశాడు.

"ఇతని పేరు నారాయణన్. భారతీయుడు. బంగ్లాదేశ్‌లో వ్యాపారంలో స్థిరపడిపోయాడట. ఇతని బంధువులు సిలోన్‌లో వున్నారని చూడటానికి వెళ్తున్నాడట."

నారాయణన్ విష్ చేశాడు స్కాట్‌ని చూస్తూ. స్కాట్ తిరిగి అభివందనం చేశాడు.

"ఈయన పేరు డేవిడ్ స్మిత్. ఇంగ్లీషు దేశస్థుడు. హాలీడే ట్రిప్ మీద వెళ్తున్నాడట."

స్కాట్‌కి మనసులో కొంచెం కంగారు వేసింది. వీళ్లంతా నిజంగా వ్యాపారస్థులేనా? అలా అనుకుంటే వీళ్ళ దృష్టిలో తనూ వ్యాపారస్థుడేగా. వీళ్ళుగూడా తనలాగ వ్యాపారం పేరుతో తిరుగాడుతున్న గూఢచారులా?

రంగుటద్దాల కళ్ళజోడు చాటున అతని కళ్ళలోని భావాల్ని కప్పిపుచ్చుకున్నాడు స్కాట్.

చాంగ్ మరికొన్ని డ్రింక్స్ తెప్పించాడు. అందరూ ఛీర్స్ చెప్పుకుని తాగారు.

"నాకు ప్రయాణం అంటే ఎంత సరదా అనుకున్నారు! ఎందుకో తెలుసా? ఇలా అనేకమంది స్నేహితుల్ని కలుసుకోవచ్చు!" అనితా గుణవర్ధనే అందరివంకా చూస్తూ అంది.

ఎవరూ మాట్లాడలేదు.

అక్కడి నిశ్శబ్దాన్ని చీలుస్తూ చాంగ్ కంఠం వినిపించింది. "అలా డెక్ మీద పచార్లుచేద్దాం పదండి, సంధ్యాసమయం ఎంతో అందంగా వుంటుంది డెక్ మీద."

ఎవరో వ్యక్తి తన ప్రక్కనే వచ్చి నిలబడిన సవ్వడి విని అతడికేసి చూసాడు స్కాట్.

అతడు బాగా పొడుగ్గా ఉన్నాడు. మిలటరీ యూనిఫారం ధరించాడు. కళ్ళు గుంటలుపడి ఉన్నాయ్. కోటేరు లాంటి ముక్కు, బుగ్గలు సొట్టలుపడి ఎముకల్ని చూపుతున్నాయ్.

స్కాట్ ని ఆశ్చర్యంగా చూసినయ్ అతడి కళ్ళు. స్కాట్ గూడ అతన్ని చూస్తూనే ఆశ్చర్యపడ్డాడు.

"మీ పేరు నరేంద్రకుమార్ కదూ? మిమ్మల్ని చూడంగానే ఆనవాలు పట్టేశాను. కాని వాళ్ళందరిలో మిమ్మల్ని బయట పెట్టటం ఇష్టంలేక వాళ్ళు వెళ్ళేదాకా వేచి ఉన్నాను."

"నిజంగానా మిస్టర్ ..."

"మిస్టర్ లే పినాయ్. ఇప్పుడు నా పేరు పినాయ్. ఆ పేరు ఎందుకు వచ్చిందో నీకూ తెలుసనుకుంటాను!"

నరేంద్రకుమార్ ఉరఫ్ మైకేల్ స్కాట్ తల

ఊపాడు అడ్డంగా. మాతృదేశానికే ద్రోహం తలపెట్టిన నీచుడికి ఏ పేరు అయితేనేం అనుకున్నాడు.

దూరంగావున్న స్టూల్ ని తెచ్చుకుని అతడి ప్రక్కనే వేసుకుని కూర్చున్నాడు. "మీరు అనుమతిస్తే మీతో రెండుముక్కలు మాట్లాడతాను," దీనంగావుంది అతడి గొంతు.

"భారత చైనాయుద్ధంలో నీవు చైనావారిచేత చిక్కి-వాళ్ళ మావో అనుచరుడివిగా ఎలా మారిపోయావో సమర్థించుకుంటూ కల్లిబొల్లి మాటలు చెప్పినా ప్రయోజనం లేదు. మాతృభూమికే ద్రోహం తలపెట్టిన నీలాంటి వాళ్ళను నేనైతే కాల్చిచంపేద్దును. కాని ప్రస్తుతం నాకందుకు అనుమతిలేదు," స్కాట్ కళ్ళు కోపంతో నిప్పులు కక్కుతున్నయ్.

"నేను ఒకప్పుడు ద్రోషినే! ఒప్పుకుంటున్నాను! నా పరిస్థితుల్లో నీవుగనుక వుంటే నీవైనా అంతకన్న చేయగలిగేదిలేదు. నీవు ఆవేశం మాని రెండుముక్కలు విను స్కాట్."

"ఈ ఓడలో పనిలేని వాళ్ళెవరన్నా వున్నారేమో వెతికి, వాళ్ళకు చెప్పుకో నీ సొద! నాకక్కర్లేదు. ఈ ప్రపంచంలో నేను ఎవర్నీ ఇంతవరకు నిన్ను ద్వేషించి నంతగా ద్వేషించలేదు. మిస్టర్ షినాయ్! **నీవు** నా ముందునుంచి ఎంత త్వరగా వెళ్ళిపోతే అంతమంచిది."

"పోనీ నేనెవరో ఏమిటో ఒక్కక్షణం మరిచిపో. నన్నో అపరిచిత వ్యక్తిగా భావించి నేను చెప్పేది విను. ఈ ఓడలో కొందరు అతిప్రమాదకరమైన వ్యక్తులున్నారు. వాళ్ళవల్ల కొద్దిరోజుల్లో ప్రపంచానికే ముప్పు వాటిల్లబో తున్నది."

అంతలో మిస్ అనితా గుణవర్ధనే, ఆమె అనుచరులూ

తిరిగివస్తూ కనుపించారు.

వాళ్ళను చూస్తూనే షినాయ్ పిల్లిలా జారుకున్నాడు, వాళ్ళు తను దగ్గరకు రాకముందే. అతడు వెళ్ళినవేపే చూస్తూ కూర్చుండిపోయాడు స్కాట్. షినాయ్ చెప్పిన మాటలు అతడి చెవుల్లో మారుమ్రోగుతున్నయ్.

## 3

ఆ సాయంత్రం స్కాట్ మంచినిద్ర తీశాడు. బార్‌లో బ్రాందీ త్రాగి డెక్ మీదకు వెళ్ళాడు "బిజినెస్" అనే మాగజైను చేతిలో పుచ్చుకుని.

డెక్ మీద రెయిల్స్ దగ్గరగా అనితా గుణవర్నే, నారాయణన్ ఇద్దరూ నిలబడి నీళ్ళమీదకు చూస్తూ నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు. పెళ్ళయిన కొత్త జంటలా ఇద్దరూ చాల చేరువగా నిలబడి, ఒకళ్ళ కొకళ్ళు రాచుకుంటూ ఏవేవో మాటలు చెప్పుకుంటూ నవ్వుతున్నారు.

స్కాట్ వాళ్ళను చూడనట్టుగా వెళ్ళిపోబోయాడు.

అంతలోనే అనితా అతన్ని పిలిచింది. "హలో స్కాట్! వెళ్ళిపోతున్నారేం? రండి! రండి!"

"మీ ఏకాంతాన్ని భగ్నంచేయటం ఇష్టంలేదు. అలా ఆ మూల మాట్లాడుకుంటున్న గుంపుదగ్గరకు వెడతాను లెండి!" అని ముందుకు పోబోయాడు.

అనితా అతడ్ని చేయిపట్టుకుని ఆపింది. "ఫరవాలేదు రండి! నారాయణన్ క్యాబిన్‌లోకి వెళుతున్నాడు!" అంటూ అతన్ని లాక్కుంది తనమీదకు. స్కాట్ తమాయించుకుని రెయిల్స్‌కి ఆనుకుని నిలబడ్డాడు.

"నారాయణన్ డార్లింగ్! నా గదిలోకి వెళ్ళి అలమారులో నేను వేసుకునే క్యాప్సుల్స్ సీసా తెచ్చిపెట్టవూ?" అతిగోముగా అతడ్ని అడిగింది.

"ఇదుగో ఇప్పుడే వెళుతున్నాను." నారాయణన్ వెళ్ళిపోయాడు.

అనితా, స్కాట్ కి దగ్గరగా జరిగింది. అతడి నడుము చుట్టూ చేయి వేసి దగ్గరగా లాక్కొని అతడి పెదిమలమీద గట్టిగా ముద్దుపెట్టుకుంది. స్కాట్ ఆమె చేతిని నెమ్మదిగా తొలగించాడు.

" మీ టీ వ్యాపారం గురించి చెప్పండి! వింటాను!" అంది అనితా.

"టీ గురించి చెప్పను. మీ అందం గురించి మాట్లాడతాను," ఆమెను పొగడుతూన్నట్టుగా అన్నాడు స్కాట్.

"నేనంత అందంగావున్నానా?" తన రొమ్ములు ఊగేట్టుగా సంబాళించుకుని అడిగింది అనితా గుణవర్ధనే.

"నిజంగా మీరు సినిమాస్టార్ కావలసినవారు. ఈ టీచర్ పోస్టులోకి ఎలా వచ్చారు?"

అనితా తను మాట్లాడేది వినటంలేదు. ఆమె చెవులు దేనో వినాలని ఆత్రంగా ఉన్నట్టున్నయ్. ఏదో జరుగబోయేదాన్ని ఊహిస్తున్నట్టుగా పరధ్యానంలో పడిపోయింది.

"నే చెప్పిందానికి ఏమంటారు?" ఆమె పరధ్యానాన్ని గమనించి మళ్ళీ అడిగాడు స్కాట్.

అనితా వులిక్కిపడింది. "సారీ! మీరేం చెప్పింది నేను వినలేను. నారాయణన్ ఇంకా రాలేదేమా అని ఆలోచిస్తున్నాను."

అంతలో వోడ క్రింది భాగంలోంచి రివాల్వర్ ప్రేలిన శబ్దం వినబడింది. అనితా భయపడ్డదానిలా స్కాట్ ని కౌగలించుకుంది "ఏమిటా శబ్దం!" అంటూ.

ఆ శబ్దం రివాల్వరు ప్రేలినశబ్దం. అయితే ప్రేలుస్తు

స్ట్రీమర్ ఇంజన్ల చప్పుడులో చాల తక్కువసాయిలో విన వచ్చింది. అయినా ఆ శబ్దం తమదాకా వచ్చేరాకముందే అనితా ఎగిరిపడింది. అంటే! ఆమె ముందుగా వేసుకున్న పథకం ప్రకారమే జరిగిందా అది!

"శబ్దమా? ఏంలేదే! నాకే శబ్దం వినపడలేదే!" అన్నాడు స్కాట్ తన మనసులోని భావాల్ని కప్పి పుచ్చుకుంటూ.

"నాకు స్పష్టంగా వినబడింది. కొంపదీసి నా గదిలోకి ఎవరూ దొంగ జొరబడలేదుగదా!...అయ్యో! నారాయణన్! నీకు భగవంతుడు మేలుచేయాలని ప్రార్థిస్తున్నాను" అంటూ శోకాలు పెట్టింది అనితా.

అనితా గుణవర్ధనే గబగబా మెట్లుదిగి క్యాబిన్ దాటి గదులవేపుగా నడిచింది. ఆమె వెనకాలే స్కాట్ నడిచాడు.

దగ్గరగా వేసివున్న తలుపుని నెట్టి లోపలి దృశ్యాన్ని చూస్తూనే కెవ్వున కేక పెట్టింది. అంతలో ఆమెకు బ్యాలెన్స్ తప్పిపోయి పడిపోయింది. ఆమె తల తలుపుకు కొట్టుకుంది. తల పగిలి నెత్తురు కారింది. ఆమెకు స్పృహ తప్పిపోయి పడిపోయింది.

స్కాట్ తలుపు నెట్టుకుని లోపలకు చూశాడు. నారాయణన్, నెత్తుటి మడుగులో పడివున్నాడు. నేల మీద బోర్లాపడిపోయాడు అతడు. ఒకచేయి జాపివుంది. చూపుడువేలుమాత్రం తెరచుకునివుంది. మిగతా వేళ్లు ముడుచుకుని వున్నయ్. ఆ వేలు చూపుతున్నవైపు చూశాడు. బాల్‌రూమ్ కనుపించింది స్కాట్‌కి.

## 4

వాకిలికి అడ్డంగా పడివున్న అనితా గుణవర్ధనేని దాటు

కుని స్కాట్, నారాయణన్ దేహం మీదకు వంగి చూశాడు. ప్రాణంలేదు.

అతడి శవానికి రెండు గజాల దూరంలో రివాల్వరు పడివుంది నేలమీద. అది .45 ఆటోమేటిక్ దని గ్రహించ టానికి అతడికి ఆట్టే టైమ్‌పట్టలేదు. స్కాట్ తన జేబు లోంచి హ్యాండ్ కర్చీఫ్ తీసి దానితో రివాల్వర్‌ని పట్టుకుని బారల్‌ని వాసన చూశాడు.

రివాల్వర్‌ని నేలమీద ఉంచాడు నెమ్మదిగా. నారా యణన్ జేబుల్లోకి చేయిపెట్టి వెదికాడు. ఒక జేబులో పర్సు ఉంది. అందులో సింహళం కరెన్సీ నోట్లు కొన్ని ఉన్నయ్. ఇతర జేబుల్లో సిగరెట్ ప్యాకెట్, లైటర్ హ్యాండ్ కర్చీఫ్, బాల్ పాయింట్ పెన్ ఉన్నయ్. వీటిల్లో దేన్ని వెదికినా ఫలితం ఉండదని వాటిని వదలే శాడు.

స్కాట్ మనసులో మెరుపులాంటి ఆలోచన వచ్చింది. మళ్ళీ అంతలోనే 'అసంభవం! అలా జరగటానికి వీల్లేదు!' అనుకున్నాడు. అయినా అనుమానం ధృవపరుచుకోడానికి అతడి కుడి చెవిక్రిందగా ఉన్న జుట్టుని కొద్దిగా ప్రక్కకు తొలగించి చూశాడు. అక్కడున్న ముద్రని చూసి స్కాట్ ఆశ్చర్యపోయాడు. అలాంటి గుర్తే తనకూ ఉంది. ఇతడు గూడ భారత ప్రభుత్వం తరఫు సీక్రెట్ ఏజెంటా? అయితే ఇతడు ఈ నౌకలో ఉంటే మళ్ళీ తననుగూడ ఎందుకు పంపినట్టు.

కారిడార్‌లో అడుగుల చప్పుడు విని స్కాట్ లేచి నిలబడ్డాడు. రివాల్వర్ ప్రేలిన శబ్దం గురించి అందరికీ తెలిసినట్టుంది, జనం పరుగెత్తుకొస్తున్నారు.

చాంగ్-యా-చాంగ్ అందరిలోనూ ముందు ఉన్నాడు. అతడిని వెన్నంటుకుని వోడ కెప్టెన్ జాన్ హెరాల్డ్

వస్తున్నారు. వాళ్ళ వెనుక ఇతర ప్యాసింజర్లూ, కళాసీలు ఉన్నారు.

"ఏం జరిగింది? ఏదైనా ఏక్సిడెంటా?" కెప్టెన్ జాన్ అడిగాడు.

"నారాయణన్‌ని ఎవరో కాల్చి చంపారు. అతని శవాన్ని చూస్తూనే అనితా స్పృహతప్పి పడిపోయింది."

చాంగ్ నేలమీదకు వంగి అనితా గుణవర్ధేని లేవదీయ బోయాడు. కాని ఆమె అచేతనంగా మళ్ళీ నేలమీదకు ఒరిగిపోయింది.

జనాన్ని చీల్చుకుంటూ డాక్టర్ వచ్చాడు. అతడు నేరుగా నారాయణన్ దేహం దగ్గరకు పోబోయాడు.

"అతను చనిపోయాడు డాక్టర్! ఈమెని ముందు పరీక్షించండి," అన్నాడు స్కాట్, డాక్టర్‌ను ఉద్దేశించి.

"హత్యా! నా వోడలోనే! ఎంత ఘోరం!" కెప్టెన్ నోరు తెరిచాడు ఆశ్చర్యంతో.

అంతలోనే మళ్ళీ అతడి కంఠం వినిపించింది పెద్దగా. "ఇది హత్యకాదు! ఏక్సిడెంట్ మాత్రమే! రివాల్వర్‌ని క్లీన్ చేస్తుంటే, అది నారాయణన్ చేతిలోనే ప్రేలింది. తెలిసిందా?" జరిగినదంతా తనకు క్షుణ్ణంగా తెలిసినవాడిలా పలికాడు కెప్టెన్.

"హత్యో! ఏక్సిడెంటో తర్వాత తేల్చుకోవచ్చు. ముందు ఈ జనాన్ని పంపేయండి!" డాక్టర్ పెద్దగా అరిచాడు.

కొందరు ప్రయాణీకులు డాక్టర్ మాటలు విని వెళ్ళిపోయారు. మిగతా వాళ్ళను కళాసీలు సర్ది పంపేశారు. అలా వెళ్ళిపోయిన వాళ్ళలో డేవిడ్ స్మిత్, షినాయ్ కూడ ఉన్నారు.

"ఇంతకీ ఏం జరిగింది ఇక్కడ? మీ రెవరు?" అన్నాడు కెప్టెన్ హెరాల్డ్ కనుబొమలు ముడిచి స్కాట్ వంక చూస్తూ.

"నా పేరు మైకేల్ స్కాట్. కొలంబోలో నాకు టీ వ్యాపారం వుంది!"

"నేను ఈ నౌకకు కెప్టెన్ ని. నే నడిగే ప్రశ్నలకు సూటిగా జవాబివ్వండి! అరె! మిస్టర్ చాంగ్ కూడ ఇక్కడున్నారే!"

"ఈమెకు ముందు ట్రీట్ మెంట్ ఇవ్వండి డాక్టర్! హంతుడ్ని గురించి తర్వాత చూడచ్చు."

కెప్టెన్ మరో లోకంలోంచి ఊడిపడ్డవాడిలా అనితా వంక చూస్తూ "మైగాడ్! మరో హత్యా?" అని అరిచాడు.

"లేదు కెప్టెన్! ఆ హత్య చూసి ఈ మనిషి స్పృహ తప్పి పడిపోయింది," స్కాట్ జవాబిచ్చాడు.

"ఈమెను ముందు ఆమె గదిలోకి చేర్చండి. ఇక్కడ ఈ రష్ లో ఆమెను చూట్టానికి వీలుపడదు" అన్నాడు డాక్టర్.

"ఇదే ఆమె క్యాబిన్ గది డాక్టర్! డెక్ మీద నేనూ, ఆమె మాట్లాడుతూండగా నారాయణన్ ఆమెకు మందు సీసా తెద్దామని ఇక్కడకు వచ్చి ఈ గతికి చేరుకున్నాడు."

"అలాగా! అయితే ఆమెను మీ డిస్పెన్సరీ రూమ్ కి చేర్చండి డాక్టర్!" కెప్టెన్ డాక్టరు వంక చూస్తూ అన్నాడు.

ఇద్దరు కళాసీలు సాయంపట్టి ఆమెను చేతులమీద మోసుకుని బయటకు వెళ్ళారు. ఆ వెనుకనే డాక్టరూ, చాంగ్ వెళ్ళారు.

"మీరు లోనికి వచ్చినప్పుడు హంతుడు ఇలాగే పడి

ఉన్నాడా? అతనిని మీరేం కదిలించలేదుగదా?" కెప్టెన్ అడిగాడు అందరూ వెళ్ళిపోయాక.

"లేదు. శవాన్ని నేను కదిలించలేదు," స్కాట్ జవాబిచ్చాడు.

"పాపం! ఎటువంటి నికృష్టపు చావు చచ్చాడు!" కెప్టెన్ సానుభూతి వెళ్ళబుచ్చాడు. "ప్రేమకోసమేనా ఇదంతా!" అని అడిగాడు మళ్ళా.

"కాదనుకుంటాను! ఇతగాడు ఏదో పెద్ద కుట్ర కేసులో ఇరుక్కున్నాడేమో అని నా అనుమానం. చాంగ్ మీకు బాగా పరిచితుడేనా?"

"అందుకు సందేహమా? అతడు హాంగ్ కాంగ్ లోకల్లా పేరుమోసిన ధనవంతుడు. అతడు నా షిప్ లో ఎన్నో సార్లు ప్రయాణం చేశాడు."

"అలాగా! ఇతని జేబుల్లో ఏమైనా ఉత్తరాలున్నయ్యేమో చూద్దాం!" అంటూ వంగి ముంగాళ్ళమీద కూర్చుని మళ్ళీ అతడి జేబులు వెతికాడు.

అతడి కలం, సిగరెట్ లైటర్ పర్సు అన్నీ నిశితంగా చూశాడు. వేటిలోనూ రహస్యపు అరలులేవు.

స్కాట్ వంకే విచిత్రంగా చూస్తున్న కెప్టెన్ అడిగాడు. "మీరు డిటెక్టివ్ లా?"

"కాదు. అయినా ఇవన్నీ జాగ్రత్తగా చూసినంత మాత్రాన డిటెక్టివ్ అవుతాడా? దయచేసి కొందరు కళాసీల్ని పిలిపించి ఈ శవాన్ని ఇక్కడనుంచి తీయించండి!"

"అవునవును! ఆ మాటే గుర్తుకు రాలేదు సుమా!" అంటూ బూట్లు టకటక లాడించుకుంటూ కెప్టెన్ బయటకు వెళ్ళిపోయాడు.

కెప్టెన్ బయటకు వెళ్ళిపోయాక స్కాట్ హతుడి

హిప్ పాకెట్‌లో చెయ్యిపెట్టి చూశాడు. చిల్లర డబ్బులు తగిలినయ్. వాటిని బయటకు తీశాడు. రెండు యాభై సెంట్ల బిళ్ళలూ (సింహళం నాణేలు), భారతదేశపు అర్థ రూపాయి ఉన్నయ్.

స్కాట్ కళ్ళు మెరిసినయ్. అర్థరూపాయి బిళ్ళను మోగించి చూశాడు. లోపల డొల్లగా ఉన్న శబ్దం మ్రోగింది. రెండు వ్రేళ్ళతో రెండు అంచుల్ని బలంగా లాగాడు. రెండు బిళ్ళలూ ఊడి వచ్చాయ్. మధ్యలో చిన్న కాగితం మడిచిపెట్టి ఉంది.

దాన్ని మడత విప్పి చదివాడు.

"అనిత అందం పురుషులకు ప్రమాదం
చాంగ్ ధనం ప్రపంచానికే ముప్పు
వెంటబడే V. I. P.కి ఇవ్వాలి జెల్ల
స్కాట్ గమ్యం ఎక్కడకు?
తెల్లని మెరిసే పళ్ళకు
చేయాలి దంతధావనం
టూత్ పేస్టుని వాడాలి తక్షణం
ఆలస్యం అమృతం విషం."

ఇదేదో భావకవిత్వం రాసుకున్నట్టుగా ఉంది. ఆ కాగితాన్ని తన మినీ కెమెరాతో ఫోటో తీశాడు. కాగితాన్ని మడిచి అర్థరూపాయి బిళ్ళల్లో ఉంచి రెండు అంచుల్నీ గట్టిగా నొక్కాడు. దాన్ని గనుక తను సంగ్రహిస్తే అది ఎవరికి చేరాలని ఉద్దేశించబడిందో వారికి చేరే అవకాశం పోతుంది.

కళాసీలను వెంటబెట్టుకుని కెప్టెన్ వచ్చాడు. నారాయణన్ శవాన్ని తీసుకువెళ్ళారు కళాసీలు. మరికొందరు నేలను కడిగి శుభ్రం చేశారు.

"అనితాకు ఎలావుంది?" స్కాట్ అడిగాడు,

"ఓ! ఆమె గూడా పడిపోయిందికదూ? ఆమె సంగతే కనుక్కోలేదు!" ఆత్రంగా వెళ్ళిపోయాడు.

స్కాట్ నవ్వుకున్నాడు. నేలమీదున్న రివాల్వర్ని కళాసీలు తీసి టేబుల్ మీద పడేశారు.

దాన్ని మరోసారి పరీక్షించాడు. ట్రిగ్గర్ దగ్గర నూలు పోగు వేలాడుతోంది. అలాంటి పోగులే గది కిటికీరంధ్రం దగ్గరగూడ కనబడ్డాయి. రివాల్వర్ గుండు దూసుకుపోయి చిల్లిపడిన టవల్ వుందేమో గదిలో అని వెతికాడు స్కాట్. కాని కనుపించలేదు.

అనితా గుణవగనే నారాయణన్ని కావాలని తన గది లోకి పంపింది. అప్పటికే హంతకుడు లోపల రెడీగా కాచుకు కూర్చున్నాడు. చేతిలో రివాల్వర్ పట్టుకుని దాని మీద టవల్ కప్పివుంచాడు. నారాయణన్ లోపలకు రాగానే కాల్చాడు.

స్కాట్ అక్కడనుంచి బయటకు వచ్చాడు. నడవ దారిలో ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని నారాయణన్ గదిదగ్గరకు వెళ్ళాడు. తన జేబులోంచి డూప్లికేట్ చెవితో తలుపు తాళంతీసి లోపలకు దూరాడు. తన వెనుకనే మళ్ళి తలుపు లోపల్నుంచి తాళం వేశాడు.

ఆ గదినంతా ఎవరో శోధించి వెతికినట్టుగా కనిపించింది. నేలమీద పరచివున్న కార్పెట్ గూడ సగం లాగి వేయబడివుంది.

నారాయణన్ చూపుడువేలు బాత్ రూమ్వంక చూపిస్తూ వున్నది అతడు చనిపోయినపుడు. ఆ సంగతి గుర్తుకు రాగానే స్కాట్ బాత్ రూమ్ తలుపు తీసుకుని లోపలకు వెళ్ళాడు.

వాష్ బేసిన్లో సబ్బూ, టవల్ ఎవరో కొద్దిసేపటిక్రితం వాడినట్టుగా వున్నయ్. అక్కడ దండెంమీద వేలాడు

తున్న టవల్ ఇంకా తడిగానేవుంది, తుడుచుకున్న భాగంలో.

రేజర్ సెట్, ఆస్పిరిన్ బిళ్ళల సీసా, సబ్బుముక్కలూ అన్నిటినీ అతిజాగ్రత్తగా పరిశీలించాడు. వాటిలో ఏమీ దొరకలేదు.

నారాయణన్ చీటీలో టూత్ పేస్టు ప్రస్తావనవుంది. ప్రక్కనేవున్న అట్టపెట్టెను తెరిచాడు. అందులో ట్యూబ్ లేదు.

అంటే ఆగంతకుడు తనకు కావలసినదాన్ని శోధించి, దొరకపుచ్చుకుని, వెళ్ళిపోయాడన్నమాట!

నారాయణన్ కూడ భారతదేశం తరఫు ఏజంట్. అతడ్ని తనకంటె ముందే పంపి వుంటారు. అతనినుంచి రిపోర్టులు రావడం ఆగిపోయేసరికి తనను పంపారు. ఏది ఏమైనా తనతోటి సీక్రెట్ ఏజంట్ ని హత్యచేసిన హంతకుడిని పట్టుకుంటేగాని తన మనసుకు శాంతివుండదు.

నారాయణన్ హత్యలో అనితా గుణవర్ధన్ కి భాగం ఉందనటానికి సందేహంలేదు. ఆమె కావాలనే నారాయణన్ ని తన గదికి వెళ్ళిరమ్మని పురమాయించింది.

హంతకుడ్ని ఆరాతీసి, పట్టుకుని బంధిస్తే అసలు కథ అడ్డం తిరుగుతుంది. ఈ ముఠాగమ్యం ఏమిటో వారి రహస్య ప్రయత్నాల్ని పూర్తిగా కనుక్కోవాలి ముందు. ఆ తర్వాత వాళ్ళని బంధించవచ్చు.

# 5

మైకేల్ స్కాట్ సిగరెట్ వెలిగించి తన చుట్టూ వున్న జనాన్ని మరోసారి చూశాడు. వాళ్ళలో షినాయ్ లేడు. నారాయణన్ హత్యజరిగిన తర్వాత అతనికి షినాయ్ ని కలుసుకునే అవకాశం రాలేదు,

కారిడార్‌లో ప్రయాణీకుల్ని తప్పుకుంటూ షినాయ్ గదిదగ్గరకు వెళ్లి తలుపు తట్టాడు స్కాట్.'

తలుపు కొద్దిగా తెరుచుకుంది. "ఎవరది?" షినాయ్ మత్తులో తడబడే మాటలో అడిగాడు.

"నేనే! స్కాట్‌ని! నీతో మాట్లాడాలి!"

షినాయ్ ఒక్క నిముషం అతడ్ని ఎగాదిగా చూశాడు.

"నేను మాట్లాడాలని ప్రయత్నించినా వినిపించుకోలేదు కదూ? ఇప్పుడు నాతో అవసరం పడిందా?" నవ్వుతూ తలుపుతీసి స్కాట్‌ని లోపలకు రానిచ్చాడు.

అతని వెనుకే తలుపుమూసి గొళ్ళెం పెట్టాడు.

షినాయ్ గదిని పరిశీలించి చూశాడు స్కాట్. గది అంతా సిగరెట్ పీకలతోనూ, ఖాళీ సారా సీసాలతోనూ చిందరవందరగా వుంది.

నిలువుచారల పైజామా, తెల్లని బనీను వేసుకుని వున్నాడు షినాయ్. అతడు వెళ్ళి తన బెడ్ మీద వాలి పోయాడు. బెడ్‌కి దగ్గరగావున్న కుర్చీలో స్కాట్ కూర్చున్నాడు.

' షినాయ్ సీసాలోని ద్రవాన్ని రెండుగ్లాసుల్లో పోశాడు ఒకటి తను తీసుకుని రెండోదాన్ని స్కాట్‌కి అందించాడు. గ్లాసులు ఖాళీ అయేదాకా ఎవరూ మాట్లాడలేదు.

ఖాళీగ్లాసుని క్రిందపెడుతూ అన్నాడు షినాయ్. "నారాయణన్ హత్యని నామీదకే నెట్టటానికి వచ్చావ్ కదూ? ఎందుకంటే మీ దృష్టిలో నేను దేశద్రోహిని. ఇప్పుడు హంత్యా నేరంగూడ అంటగడతారు."

స్కాట్ అతని మాటలు విననట్టుగా తన చేతిలోని సిగరెట్ కొసని ఏష్ట్రేలో పడేశాడు.

"క్రితంసారి నీ వేకో ప్రపంచానికే ముప్పు తెచ్చేవిషయం గురించి ప్రస్తావించావు కదూ?"

షినాయ్ స్కాట్ ముఖంలోకి చూశాడు. "అవును! నిజమే! కానీ ఇప్పుడు నీ కా రహస్యం వెల్లడించను. ఆ ఛాన్స్ ఇదివరకే పోయింది నీకు" గర్వంగా అన్నాడు షినాయ్.

"ఇప్పుడు మాత్రం మించిపోయిన దేముంది?"

"అలా వీల్లేదు. నేను నీతో మాట్లాడినప్పుడు నీవు బెట్టు చేశావ్. ఇప్పుడు నా వంతు బెట్టు పోవటం!"

స్కాట్ మరో సిగరెట్ వెలిగించాడు. షినాయ్ చెప్పేది నిజమే. అతన్ని ద్రోహి కింద పరిగణించి, మనిషికన్న హీనంగా చూశాడు ఇంతవరకు.

షినాయ్ చైనా-భారత యుద్ధంలో చైనా వాళ్ళ చేతిలో బందీ అయాడు. వాళ్ళు అతన్ని చైనా తీసుకు వెళ్ళి బ్రెయిన్ వాష్ చేశారు. అతడు శత్రువుల చేతుల్లో బందీగా ఉన్నప్పుడు అతడంటే అందరూ సానుభూతి చూపారు. కాని అతడు శత్రువుల ప్రాపగాండాకు లొంగిపోయి మావో సూత్రాలను ప్రవచించేసరికి స్కాట్ కీ అతడి అనుచరులకూ షినాయ్ అంటే ద్వేషం కలిగింది.

"నా నుంచి నీకు రహస్య సమాచారం కావాలంటే నీవూ నాకో సాయం చేయవలసి ఉంటుంది. నాకు మళ్ళీ భారతదేశం గడ్డమీద అడుగుపెట్టటానికి పర్మిషన్ ఇప్పించాలి."

స్కాట్ నిట్టూర్పు విడిచాడు. తను శ్రమపడి అతనికి అనుమతి లభించేట్టు చేసినా అతడు నిర్దోషిగా ఋజువు కాగలడా? జనం అతడిన్ని పిచ్చికుక్కను కొట్టినట్టుగా కొట్టి చంపరుగదా?

షినాయ్ కళ్ళల్లోకి సూటిగా చూశాడు స్కాట్. "నారాయణన్ని ఎందుకు హత్య చేసావ్?"

"లేదు! అతడిన్ని నేను చంపలేదు," షినాయ్ నింపాదిగా అన్నాడు.

"భారతదేశం నిన్ను విడుదల చేయించేందుకు విశ్వ ప్రయత్నాలు చేస్తున్న సమయంలో నీవేమో శత్రువుల్లో కలిసిపోయావ్! ఇప్పుడేమో చైనా గడ్డమీదనుంచి నిన్ను తన్ని తగిలేశారు. కనుక నీవు భారతదేశం తిరిగి వస్తానంటావ్!"

"ప్లీజ్! ఈ ఒక్క విషయంలో సాయం చేయలేవూ?"

"సారీ! హంతకుడికైనా కనికరం చూపించగలనుగాని, మాతృదేశానికి ద్రోహం తలపెట్టిన వ్యక్తికి సానుభూతి చూపించలేను."

"అలా అయితే నాకు తెలిసిన రహస్య సమాచారాన్ని నీకు చెప్పను. అందువలన ప్రపంచమంతా నాశనమయితే నాకేం, లేదా మూడో ప్రపంచ యుద్ధం ప్రజ్వరిల్లితే నాకేం!" క్షీమాగా అన్నాడు షినాయ్. అతడి కంఠంలోనూ, మాటల్లోనూ బెదిరింపు ధోరణి వ్యక్తమవుతున్నది.

"ఇప్పుడు నీవు చెప్పకపోయినంత మాత్రాన ప్రపంచం మునిగిపోదు. నీ సాయం లేకపోయినా, ఆలస్యంగానైనా ఆ రహస్యాన్ని ఛేదించకుండా వదలను" అంటూ స్కాట్ క్షీమాగా అడుగులువేస్తూ తలుపు తెరచుకుని గదిలోంచి బయటపడ్డాడు.

# 6

"ఓ! మీరా? రండి! రండి!" అంది అనితా గుణవర్ధనే తలుపు తీస్తూ.

"ఎలా ఉంది మీకు. స్టీమర్ కెప్టెన్ అభ్యర్ధనమీద నారాయణన్ హత్యగురించి ఆరా తీస్తున్నాను."

అనితా కళ్ళల్లో నీళ్ళు నిలిచినయ్. జేబుగుడ్డతో కళ్ళు తుడుచుకుంటూ అతని భుజంపై తల ఆనించింది. "పాపిష్టిదాన్ని. మాత్రల సీసాకోసం అతడ్ని పంపకుండా ఉంటే

అతడు బ్రతికేవాడేమో! ఆ వచ్చిన దొంగ నా గదిలో క్యాష్, నగలూ ఎత్తుకుని పోయి ఉండేవాడు. అవి పోతే పోయినయ్. నారాయణన్ అన్నా నాకు దక్కేవాడు."

"పదండి! అలా కూర్చుందురుగాని!" అంటూ ఆమె నడుంచుట్టూ చెయ్యి వేసి ఆమెను నడిపించుకుంటూ తీసుకు వెళ్ళి బెడ్ మీద కూర్చోబెట్టాడు.

"పిస్తోలుమీద హంతకుడి వ్రేలిముద్రలు దొరకలేదా?" అనితా అడిగింది.

"రివాల్వర్ల గురించీ, తుపాకుల గురించీ నా కంతగా తెలీదు. అందుకని దాని విషయం నేను పట్టించుకోలేదు."

అనితా దిండుని ఆసరాగా చేసుకుని వెనక్కు వాలి కూర్చుంది. స్లీవ్‌లెస్ జాకెట్‌లోంచి ఆమె రొమ్ములు ఎగిరెగిరి పడుతున్నయ్, ఆమె శ్వాస పీల్చి వదిలినప్పుడల్లా. ఆమె బాధ చూసి నవ్వుకున్నాడు స్కాట్. తనను ఆకట్టుకోవాలని తాపత్రయంతో ఆమె యాక్షన్ చేస్తున్నదని ఇట్టే తెలిసిపోతోంది.

"నారాయణన్‌తో నీకు పరిచయం ఎలా అయింది?" స్కాట్ అడిగాడు.

"అతడ్ని ఈ వోడలోనే కలుసుకోవటం! మొదటి చూపుల్లోనే మా మనసులు కలుసుకున్నయ్. కొలంబో చేరంగానే పెళ్ళి చేసుకుందాం అనుకున్నాం ఇద్దరం."

"అతడికి వివాహం కాలేదా? అతడు అవివాహితుడా?"

"కాదు! అతడికి లోగడ పెళ్ళయిందట. ఇతగాడి ఆరోగ్యం సరిలేదని ఆమే ఇతనితో విడాకులు తీసుకున్నదట! ఆఁ! ఇప్పుడు తెలిసింది! నారాయణన్ ఆత్మహత్య చేసుకున్నాడు."

"ఆత్మహత్యా? ఎలా చెప్పగలవు?"

"అతడి మొదటి వివాహం విచ్ఛిన్నమయిపోయింది,

నేను పెళ్లి చేసుకుందామనగానే అతడిలో మళ్ళీ నిరాశ మొలకెత్తి వుంటుంది. ఈ పెళ్లిగూడ చివరకు మొదటి వివాహం లాగానే విడాకులకు దారితీస్తుందేమో అని భయపడి, జీవితంమీద విరక్తిపొంది ఆత్మహత్య చేసుకుని వుంటాడు!"

"పోనీ మీ ఊహే కరెక్టు అనుకుందాం! అంత ఆత్మహత్య చేసుకునే మనిషి అయితే కనీసం నిన్నుద్దేశించి అయినా ఉత్తరం రాసిపెట్టి చనిపోడా?"

అనితా కళ్లు పెద్దవిచేసి చూసింది. నారాయణన్ ఆత్మహత్య చేసుకున్నాడన్న తన అభిప్రాయాన్ని అంతలోనే మార్చుకుంది. "ఆఁ! అవునవును! అదీ నిజమే!"

"చాంగ్‌ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"చాలా కలుపుగోలు మనిషి. వోడ ప్రయాణంలోనే అతడితోనూ పరిచయం అయింది. నాకు నెక్లెస్ బహూకరించాడు."

"అయితే అతనితోనే వుండిపోకపోయారా? నారాయణన్‌తో వివాహ ప్రసక్తి ఎందుకు తెచ్చారు?"

ఆమె నవ్వింది. "ఈ ధనవంతుల సంగతి మీకు తెలీదు. ఆ కాసేపు మహా ఆత్రుత పడిపోతారు. వాళ్ళ వేడి చల్లారగానే దులపరించుకుని వెళ్ళిపోతారు. అందుకే నారాయణన్‌ని వివాహమాడి గతజీవితానికి స్వస్తి చెప్పదామనుకున్నాను."

"డేవిడ్ స్మిత్ విషయం ఏమంటారు?"

"అతడితో నాకు పరిచయం లేదు. మొన్న అతడు నా దగ్గరికి వచ్చినమాట నిజమే! తన సంసారాన్ని వదిలివచ్చి రెండు నెలలయిందని చెప్పాడు. ఆడదాని పొందుదొరక్క అల్లాడిపోతున్నానని మొరపెట్టుకున్నాడు. ఒక్కసారి అంటే ఒక్కసారి తనకోర్కె తీర్చమని ప్రాధేయ

పడ్డాడు. డబ్బుగూడ ఇవ్వజూపాడు. నేను తీసుకోలేదు అతడి కోర్కె తీర్చిపంపాను.''

''నా ప్రశ్నలతో విసిగించినట్టున్నాను! ఇదే ఆఖరి ప్రశ్న! షినాయ్ గురించిగూడ ఏమైనా తెలుసా?''

''ఓ! మీరుచెప్పేది ఇంద్రజిత్ పరిషద్ గురించేనా?''

షినాయ్ అసలు పేరు అప్పుడు స్ఫురించింది స్కాట్ కి. నారాయణన్ తన భావికవిత్వంలో వి. ఐ. పి. అని పేర్కొన్నాడు. ఆ మాటకు అర్థం వెరీ ఇంపార్టెంట్ పర్సన్ కాదన్నమాట. వి. ఇంద్రజిత్ పరిషద్. ప్రస్తుతం షినాయ్ గా చెలామణి అవుతున్న వ్యక్తిగురించి అయి వుంటుంది.

''అతడి చరిత్ర చాలావుంది. అది చాలామందికి తెలీదు. భారత సైన్యంలో పనిచేస్తూ చైనాకు పారిపోయాడు. అక్కడ కొన్నాళ్లువుండి మళ్లీ అక్కడనుంచీ పలాయనం చిత్తగించాడు. మరి ఇప్పుడు అతని గమ్యం ఎక్కడికో!''

స్కాట్ ఆశ్చర్యపోయాడు. షినాయ్ పూర్వచరిత్ర ఎవరికీ తెలీదనుకుంటున్నాడు తను. కాని ఈమెకు అతని గుట్టు అంతా తెలుసన్నమాట.

# 7

కేబిన్ అంతా మారు మ్రోగిపోయేలా కేక వినిపించింది.

ఆ కేక షినాయ్ గదిలోంచి వచ్చింది. అప్పటికి రాత్రయింది. కారిడార్ లో దీపాలు వెలుగుతున్నయ్.

''అయ్యో బాబోయ్! నన్ను చంపేస్తున్నాడు! నన్ను చంపేస్తున్నాడు!'' షినాయ్ కేకలు మరోసారి మారు మ్రోగినాయి.

స్కాట్ తలుపు తెరిచాడు. అంతలోనే కరెంటు

పోయింది. అంతా గాఢాంధకారం అలుముకుంది.

ఎవరో వ్యక్తి షినాయ్ గదిలోంచి పరుగెత్తటం కనిపించింది స్కాట్‌కి. ఎదురువెళ్ళి ఆ వ్యక్తిని అటకాయించాలని చూశాడు స్కాట్. కాని ఆగంతకుడు అది ముందే ఊహించినవాడిలా, తన చేతిలోని కత్తితో స్కాట్ చేతిమీద పొడిచాడు. స్కాట్ చేయిని వెనక్కి తీసుకున్నాడు బాధతో మూల్గి. ఆగంతకుడు దాటిపోయాడు.

చీకట్లోనే నడవాలోకి జనం చేరారు. మాట్లాడే గొంతులే తప్ప ఆ చీకట్లో ముఖాలు కనబడడంలేదు. పారిపోతున్న వ్యక్తి అడుగుల చప్పుడూ, చీకట్లో ఏదో గదితలుపు దభాలున మూసుకున్న చప్పుడు వినిపించినయి స్కాట్‌కి.

అంతలో లైట్లు వెలిగాయి. వోడ కళాసీ స్విచ్‌బోర్డు దగ్గరకు వెళ్ళి 'ఆఫ్'లో ఉన్న మెయిన్ స్విచ్‌ని 'ఆన్'లో పెట్టడంవల్లనే లైట్లు వెలిగినయ్.

"ఏముంది?" "ఏమి జరిగింది?" అనే ప్రయాణీకుల ప్రశ్నలు వినిపించాయేగాని జరిగినదేమిటో ఎవరూ చెప్పలేకపోయారు.

స్కాట్ తన హ్యాండ్ కర్చీఫ్‌ని గాయం తగిలినచోట చేతికి కట్టుకట్టాడు.

వోడ కెప్టెన్ జాన్ హెరాల్డ్ రొప్పుకుంటూ వచ్చాడు. స్కాట్ చేతికున్న గాయాన్ని చూసి "ఏమి జరిగింది? మరో హత్యా? లేక ఆత్మహత్యా?"

"షినాయ్ గదిలోంచి కేకలు వినపడ్డాయి. నేను గదిలోంచి బయటకు రాగానే కరెంటుపోయింది. చీకట్లో పరుగెత్తుకు వస్తున్న ఆగంతకుడ్ని అటకాయించబోయాను. నన్ను గాయపరచి అతడు పారిపోయాడు."

షినాయ్ గదిలోంచి సన్నగా మూలుగు వస్తోంది.

"నన్ను రక్షించండి కెప్టెన్! ఆ దుర్మార్గులు మళ్ళీ నా వెంటబడ్డారు," అన్న అరుపు వినవచ్చింది.

స్కాట్, కెప్టెన్ హెరాల్డ్ ఇద్దరూ షినాయ్ గది లోకి పరుగెత్తారు. వాళ్ళ వెనుకే మెడికల్ ఛెస్ట్ తీసుకుని డాక్టర్ జొరబడ్డాడు.

ఆత్రుతగా గదిలోకి ఎగబడుతున్న ఇతర ప్యాసింజెర్లను వాళ్ళ గదుల్లోకి పంపుతున్నారు కళాసీలు.

షినాయ్ ఎడమ చెక్కిలిమీదా, చేతులమీదా, చెవి క్రిందిగానూ కత్తిగాట్లున్నాయ్. వాటినుంచి రక్తం కారు తోంది.

అతడ్ని బల్లమీద పడుకోబెట్టి డాక్టర్ గాయాలను కడిగి బ్యాండేజ్ చెయ్యసాగాడు.

స్కాట్ గదినంతా కలయజూశాడు. కుర్చీలు పడదోసి ఉన్నయ్. నేలమీద పరిచివున్న కార్పెట్ గూడ సగం మడతపడి ఉంది. ఆగంతకుడికీ, షినాయ్‌కీ మధ్య పెనుగులాట జరిగిందని చెప్పటానికి కావలసినంత సాక్ష్యం ఉంది ఆ గదిలో.

తను ఆగంతకుడిని లీలగా చీకట్లో చూశాడు. అతడు తనకన్న పొట్టిగా ఉన్నాడు. కాకపోతే కొంచెం బలి ష్టంగా ఉన్నాడు. చాంగ్, స్మిత్ లేదా అనితా గుణవర్ధనే ఈ ముగ్గురిలో ఎవరూ అవటానికి వీల్లేదు. అతను ఈ పని కోసం ప్రత్యేకంగా నియమించబడ్డ కిరాయి మనిషి అయి ఉండాలి.

ఆ వ్యక్తి దక్షిణపు వేపుగా పరుగెత్తాడు. ఆ దారంట వున్న గదుల తలుపులన్నీ మూసి వుంటవి. అదే గనుక ఉత్తరపు వేపుగా వెళ్తే అక్కడ డింగీ పడవలూ, టార్పా లిన్‌లూ ఇతర నౌకా సామాగ్రి చిందరవందరగా పడి ఉంటవి. వాటిమధ్య అతడు ఎవరికీ కనబడకుండా మాయ

మయిపోవచ్చు. అలా ఉత్తరపు వేపుకు వెళ్ళకుండా దక్షిణాపు వేపుకు వెళ్ళాడంటే అతనికి ఆశ్రయమిచ్చే వాళ్ళు ఆ గదుల్లో వుంటున్నారన్నమాట!

షినాయ్ కేకలు వినపడంగానే కరెంటుపోయింది. అంటే ఆగంతకుడికి ఆమాత్రం తెలియకుండా ఉండగలందులకు మరో వ్యక్తి మెయిన్ స్విచ్ దగ్గరకువెళ్ళి కరెంటు ఆఫ్ చేశాడు. ఎవరా రెండో వ్యక్తి? అతడే షినాయ్‌పై హత్యాప్రయత్నం చేయించి ఉంటాడు. కత్తితో గాయపరచిన కిరాయి మనిషికన్న ఈ తెరవెనుక మనిషే ముఖ్యం.

షినాయ్‌కి కట్లుకట్టడం పూర్తయాక డాక్టర్, స్కాట్ చేతికున్న గాయానికి కట్టుకట్టాడు.

తర్వాత షినాయ్‌కి ఇంజెక్షన్ ఇచ్చాడు డాక్టర్. "అబ్బ! అమ్మ! బాధ!" అంటూ మూల్గాడు షినాయ్.

"మిస్టర్ కెప్టెన్! అతడిపై హత్యాప్రయత్నం జరిగింది. అతడు పూర్తిగా చావలేదని తెలిస్తే, ఇతడిపై మరో హత్యాప్రయత్నం జరగవచ్చు. కనుక ఇక్కడ గట్టి బందోబస్తు ఏర్పాటుచేయండి, ఒకటి రెండు రోజుల వరకు!"

"అలాగే డాక్టర్!" అంటూ కెప్టెన్ హెరాల్డ్ అప్పటికప్పుడే ఒక సెక్యూరిటీ మనిషిని ఆ గదిదగ్గర కాపలాకి ఏర్పాటుచేశాడు.

"షినాయ్‌కి తెలివి వచ్చేదాకా అతడి దగ్గర నేను సాయంగా వుంటాను! మీకేమైనా అభ్యంతరమా కెప్టెన్!" స్కాట్ అడిగాడు.

"అభ్యంతరం ఏంలేదు! అలాగే వుండండి!"

మెడికల్ చెస్ట్ సర్దుకుని డాక్టరూ, కెప్టెన్ ఇద్దరూ వెళ్ళిపోయారు.

వాళ్ళ వెనక నే తలుపు మూసేశాడు స్కాట్. షినాయ్ బెడ్ దగ్గరకు వెళ్ళి వంగి అతడి ముఖంలోకి చూశాడు.

షినాయ్ కళ్ళు తెరిచాడు. "వాళ్ళంతా వెళ్ళి పోయారా?" అని అడిగాడు.

"వెళ్ళిపోయారు" అన్నాడు స్కాట్.

"దొంగరాస్కెల్! వాడిచావు కళ్ళజూసేవాడ్ని. తప్పించుకుని బ్రతికిపోయాడు."

"వాడు అంటున్నావ్ మొగవాడేనా? ఆడదికాదా?"

"మొగవాడే! నిద్రపోతుండగా ఎందుకో మెలకువ వచ్చింది. కళ్ళు తెరచేసరికి వాడుచేతిలో కత్తితో నామీదకు వంగుతున్నాడు. నేను ఛటాలున ప్రక్కకు దొర్లాను. వాడి కత్తి పరుపులో దిగింది. తేరుకుని వాడ్ని కాలితో బలంగా తన్నాను డొక్కలో. కత్తితోసహా వాడు వెనక్కి పడిపోయాడు."

"క్షొద్దిలో నీకు చావు తప్పింది. ఎందుకయినా మంచిది కొంతకాలం జాగ్రత్తగావుండు," అంటూ స్కాట్ బెడ్ మీదనుంచీ లేవబోయాడు.

షినాయ్ చేయి ముందుకు చాచాడు. స్కాట్ స్లాక్ చివర పట్టుకుని లాగాడు. "కాసేపు కూర్చో! నా షరతులకు ఒప్పుకోకపోయినా నీకు ఆ రహస్యం చెప్పేస్తాను."

"నీ రహస్యాన్ని చెప్పినాగాని నేను నీకు పర్సనల్ గా ఎటువంటి సాయంచేయను," నిష్కర్షగా అన్నాడు స్కాట్.

"నా కేకలు విని అందరికంటే ముందు పరుగెత్తుకు వచ్చినవాడివి నీవు. అంటే నాకు సాయంచేయాలనేగా వచ్చింది. అందుకే నా మనసులోని విషయాల్ని చెప్పే

స్తాను. వాళ్లు నన్ను కొలంబో చేరనివ్వరు ప్రాణాలతో."

"వాళ్లు! ఎవరు వాళ్ళు?" ఉద్రేకంగా అడిగాడు స్కాట్.

"అదే! చైనావాళ్ళు!"

"నీవనేదేమిటో అర్థంకావటంలేదు. నీవు మాతృదేశానికే ద్రోహం తలపెట్టి చైనా వాళ్ళల్లో చేరిపోయావు గదా? ఇంకా నీపై వాళ్ళకు కక్ష్య ఎందుకు?"

"నీకు తెలీదు స్కాట్! వాళ్ళు త్వరలోనే మూడో ప్రపంచయుద్ధంకన్న భీభత్సాన్ని సృష్టించబోతున్నారు. వాళ్ళచేతికి ఆ ఫార్ములా దొరికిందంటే ప్రపంచానికే వినాశం కలగబోతున్నదన్నమాట!"

## 8

"రోగకారకులయిన క్రిమిబాంబుల్ని చైనావారు కని పెట్టారా ఏం? అదేం కొత్త విద్యకాదు. కొరియాలోనూ, వియత్నాంలోనూ అమెరికావారు వాడారు."

సినాయ్ అసహనంగా వెనక్కు వాలిపోయాడు దిండ్ల మీద. "నామాటే వినిపించుకోరు ఎవరూ? చైనానుంచి బయటపడగానే బర్మాలోని, ఢాకాలోని అధికారులకు నే తీసోరూ బాంబుకని చెప్పాను. అందరూ నన్నొకపిచ్చోడి క్రింద జమకట్టారుగాని నా మాటల్లోని నిజాన్ని ఎవరూ పట్టించుకోలేదు."

"సరే! నీవు చెప్పదలుచుకున్నదేదో మొదటినుంచీ వివరంగా చెప్పు!"

"చైనావారితో యుద్ధంలో కొందరు వారిచేతిలో ఖైదీలుగా చిక్కారు. వారిలో నేనూ ఉన్నాను. మమ్మల్ని శారీరకంగా నానాహింసలు పెట్టారు.

"ఆ తర్వాత మమ్మల్ని నాన్‌కింగ్ మిలిటరీ హెడ్ క్వార్టర్స్‌కు తరలించారు. అక్కడే మా మతుల్ని పోగొట్టే

చిత్రహింసను కళ్ళారా చూశాం. అవే ఎలుకబోను శిక్ష. బ్రతికున్న మనిషిని నగ్నంగా గాజుపేటికలో పడుకోబెడతారు. ఆ పెట్టెకు చివరగా అర వుంటుంది. దానికి కన్నం వుంటుంది. ఆ అరలో కొంచెం సీమపందిమాంసం ఉంచుతారు.

"నాలుగైదు రోజులుగా ఆహారంలేకుండా కొన్ని ఎలుకల్ని మాడ్చి వుంచుతారు. వాటిని ఈ పేటికలోకి వదులుతారు. అవి ముందు సీమపందిమాంసం తినేస్తవి. ఆతర్వాత ప్రక్కఆరలో పడుకునివున్న మనిషి మీదకు దూకుతాయి ఆరాకలితో. మనిషి బ్రతికుండగానే అతడి శరీరంలో కండల్ని కొరుక్కుతింటాయి.

"అయితే ఈ పని ఒక నిముషంలోనో లేక అర గంటలోనో పూర్తిఅయేదికాదు. నాలుగైదు గంటలు ఈ హింసాకాండ జరుగుతుంది. లోపలున్న మనిషి తనకు పట్టిన గతికి గుండె ఆగి చనిపోయాడా, వాడు అదృష్టవంతుడే! లేకపోతే నాలుగుగంటలు ప్రత్యక్ష నరకాన్ని అనుభవిస్తాడు.

"పైగా మిగిలిన ఖైదీలందర్నీ ఈ చిత్రహింసను చూస్తూ కూర్చుండబెడతారు. వాళ్ళలో కొందరికి అక్కడికక్కడే పిచ్చెక్కుతుంది, రాముగూడ ఆదేశిక్ష అనుభవించాల్సి వస్తుందని! అంతటి మానసిక చిత్రహింస పగవాడికికూడా వద్దు."

షినాయ్ ఆగాడు. చేయిచాచి సిగరెట్ ప్యాకెట్ తెరచి సిగరెట్ నోట్లో పెట్టుకున్నాడు. స్కాట్ అగ్గిపుల్లగీచి సిగరెట్ వెలిగించాడు. గబగబ నాలుగుదమ్ములు లాగి యాష్ట్రేలో పడేశాడు.

"తర్వాత మాలో కొందరు మావో సిద్ధాంతాల్ని ప్రచారం చేయటానికి ఎన్నుకోబడ్డారు. అటువంటి దుర

దృష్టవంతుల్లో నేనూ వున్నాను. ప్రొఫెసర్లు, సైకాలజిస్టులు మమ్మల్ని బ్రెయిన్ వాష్ చేశారు. వాళ్ళ చేతుల్లో చిత్రహింసలు భరించలేక మావో సూక్తులు అప్పజెప్ప సాగాను.

“దాంతో వాళ్ళ దృష్టిలో నేను ‘మంచిబాలుడ’ నయాను. నన్ను వసతైన జైలుకు మార్చారు. వ్యక్తి స్వాతంత్ర్యం లేదనేగాని నాకు రాజభోగాలు ఏర్పాటు చేయబడినై. రెండురోజులకొకసారి పసందయిన అమ్మాయిని గూడా పంపేవారు. వాళ్ళు కేవలం మమ్మల్ని సుఖపెట్టటానికి వచ్చినవాళ్ళు కారు. మా అంతరాంతరాల్లో దాగిన రహస్యాల్ని బయటకులాగి కూపీ దీయటానికి వచ్చిన గూఢచారిణులు.

“బాగా తాగిన మైకంలో ఒకామెతో నా మనసులో దాగివున్న రహస్యం వెల్లడించాను. చైనానుంచి ఏనాటికైనా పారిపోవాలని వుందని చెప్పాను. ఇంకేముంది? అగ్నిపర్వతం బద్దలయింది. నన్ను తక్కువరకం జైలుకు మార్చారు. నాసిరకం స్త్రీలను పంపేవారు అప్పుడప్పుడు. సుఖరోగాలు తగిలాయి. వాటికి వైద్య సదుపాయంగూడ వుండేదికాదు. ఆ రోగాలతో మేము బాధపడితే అదే మాకు సరైన శిక్ష అని వాళ్ళు భావించారు.

“నేను ఆ జైలులో అలా బాధలు పడుతున్న రోజుల్లో నా ‘సెల్’ లోనికి మరో ఖైదీ వచ్చాడు. అతనో పెద్ద సైంటిస్ట్ అట. ప్లేగు, కలరా ఉత్పత్తిచేసే వేర్వేరు క్రిముల్ని కలిపి, వాటివల్ల మరోకొత్తరకం క్రిమి ఉద్భవించేట్టు చేశాడు.

“ఈ కొత్తరకం క్రిముల్ని దేశంలో వదిలితే అవి ఒక రోజులో నాలుగింతలుగా వ్యాప్తి చెందుతాయి. వాటి ప్రభావంవల్ల సరికొత్తరకం జబ్బువచ్చి ప్రజలు అక్కడి

కక్కడే చనిపోతారు.

"ప్రపంచాన్నంతా అలా తమ స్వాధీనంలోకి తెచ్చుకున్న తర్వాత తమ దేశంలోని అధిక జనాభాని ప్రపంచమంతా పంపుతారు. ప్రపంచ పాలకులు అవుతారు ఆ తర్వాత!" షినాయ్ ఆయాసంతో ఆగాడు.

"అద్భుతం! అత్యద్భుతం!" అన్నాడు స్కాట్.

షినాయ్ మళ్ళీ మొదలు పెట్టాడు.

"అయితే వారి పథకానికి మరో అవాంతరం వచ్చింది. ఆ వ్యాధిని నయంచేసే ఇన్సులిన్‌ని కనిపెట్టమని సైంటిస్ట్‌ని కోరారు. అలాంటి ఇన్సులిన్ తయారయాక దాన్ని చైనా ప్రజలంతా ఇంజెక్షన్ ద్వారా పుచ్చుకుని, అప్పుడు ఈ కొత్త క్రిముల్ని ప్రపంచమంతా వ్యాపింపజేస్తారు.

"ఇక్కడే సైంటిస్టు అడ్డం తిరిగాడు. చైనావారి ప్లాన్ విని అతడు తనమూలంగా ప్రపంచానికి వాటిల్లబోతున్న ప్రమాదాన్ని పసిగట్టి, ఇన్సులిన్ తయారుచేయటానికి నిరాకరించాడు.

"ఆ ఇన్సులిన్ తయారయితే తప్ప చైనీయులు ఈ కొత్త క్రిముల్ని ప్రపంచంమీద ప్రయోగించలేరు. అందుకే అతను పెడదిరిగాడు.

"అతడ్ని ఎన్నో రకాలుగా, క్రూరాతిక్రూరంగా హింసలు పెట్టారు. అవన్నీ భరించటానికే అతడు తయారయాడుగాని ఇన్సులిన్ ఫార్ములా వాళ్ళకు ఇవ్వలేదు. ఈ పరిసితుల్లో అతడు నా జైలులోకే పంపబడ్డాడు. మేమిద్దరం మంచి స్నేహితులమయాం. అతడి కోటకి ఒకటి మిగిలిపోయింది. ఇన్సులిన్ ఫార్ములాని బయట ప్రపంచానికి అందజేయగలిగితే చైనావాళ్ళ ఆట కడుతుంది. కానీ జైల్లో ఉన్న మాకు దాన్ని ఎలా బయటకు అందజేయటం అనేది సమస్య అయింది.

"నా దగ్గర కూలీడబ్బు చాలావుంది. అవి సెంట్రీలకు పంచిపెట్టి వారిసాయంతో అక్కడనుంచి పరారీ అవాలనుకున్నాను. నేను బయటకు పారిపోతున్న విషయం పసిగట్టిన సైంటిస్టు ఆ ఫార్ములాని నాకు అప్పజెప్పి దాన్ని ఎలాగైనా విదేశాల్లోని రక్షణ శాఖకు అందజేయమని ప్రార్థించాడు. నేను సెంట్రీ సాయంతో జైల్లోంచి తప్పించుకోగానే ఆ సైంటిస్టు ఆత్మహత్య చేసుకుని చనిపోయాడట."

"పాపం! అంతటి మేధావంతుడికి ఎంతటి గతి పట్టింది!"

"అవును! ఆ సైంటిస్టు ఫార్ములాని తీసుకుని నేను బర్మా పారిపోయాను. రక్షణ శాఖలో ఉన్నతోద్యోగుల్ని కలుసుకుని వాళ్ళకు ఫార్ములా చూపించాను. అయినా వాళ్ళు నా మాటల్ని విశ్వసించలేదు. ఆ ఫార్ములా నా దగ్గరుంటే నాకూ అపాయమే! అందుకని దాన్ని సింహళంలోని ఒక లేడీ సైంటిస్టుకి పంపాను పోస్టులో. ఆమె అడ్రసుకూడ జైల్లో వున్నప్పుడు సైంటిస్ట్ ఇచ్చాడు. ఇప్పుడు నా ప్రయాణం అక్కడికే. ఈ లోపల ఈ చైనావాడు నామీద పగబట్టినట్టున్నాడు. నేను ప్రాణాలతో సింహళం చేరగలనో లేనో! ఒక వేళ నా ప్రాణాలు పోతే ఆ ఫార్ములాని కనీసం భారతదేశపు రక్షణశాఖకు అందజేస్తావుకదూ?"

మైకేల్ స్కాట్ అతడు చెప్పినదంతావిని ఆశ్చర్యపోయాడు. ఈ కొత్తరకం క్రిమివలన ప్రపంచానికి ఆటం బాంబు, హైడ్రోజన్ బాంబులకన్న ఎక్కువ ప్రమాదం సంభవించేలావుంది అనుకున్నాడు.

"ఆ ఆడ సైంటిస్టు పేరేమిటో?" అడిగాడు స్కాట్.

"విజయా సేనానాయకే! కాండీ అనే సిటీలో ఆమె

ప్రభుత్వ రక్షణ శాఖలో పనిచేస్తోంది! ఇప్పటికైనా నమ్ముతావా నా మాటలు నిజమని.''

స్కాట్ సూటిగా షినాయ్ కళ్ళల్లోకి చూశాడు. నోట్లోని సిగరెట్ దమ్ము ఆఖరిసారిగా లాగి సిగరెట్ని ఏష్ట్రేలో పడేశాడు.

''మొదటిది! నీతో పెద్దగా పరిచయంలేని సైంటిస్టు నిన్ను ఎలా నమ్మాడు? నీ చేతిలో అతని ఫార్ములా భద్రంగా బయట ప్రపంచానికి చేరుతుందనుకున్నాడా?''

షినాయ్ ఒక నిముషం ఆలోచించాడు. ''నీ వడిగింది సబబుగానే ఉంది! సైంటిస్టు తన జీవితాన్ని ముగించుకునే ఉద్దేశ్యానికి వచ్చాడు, వాళ్ళ చిత్రహింసలు భరించలేక. అతనికి అందుబాటులో వున్నది నేనొక్కడ్నే! పైగా నేను వీలైనంత త్వరలో చైనావారి చేతుల్లోంచి తప్పించుకుందామనే ఆలోచనలో వున్నట్టు నేనే అతడికి వెల్లడించాను.''

''ఆ తర్వాత నీవు నీ పథకం ప్రకారం చైనానుంచి పారిపోయి వచ్చావ్?''

''అవును.''

''చైనావారి చేతుల్లోంచి తప్పించుకోవటం అంత సామాన్యమా మిస్టర్ షినాయ్!'' స్కాట్ అనుమానంగా చూశాడు.

షినాయ్ నోరు వెళ్ళబెట్టి చూస్తూ కూర్చున్నాడు.

''వాళ్ళ అనుమానం నీమీదకే పోయింది. సైంటిస్టు తన ఫార్ములా గురించి నీకు చెప్పివుండవచ్చని వాళ్ళు వూహించారు. నీకు పారిపోవటానికి అవకాశం కల్పించారు. నీవు ఎక్కడికి వెళతావో వారికీ తెలుసు. సరాసరి ఫార్ములా ఎక్కడుందో అక్కడకు చేరతావు నీవు. నీ వెనకాలే వాళ్ళూ వచ్చి ఆ ఫార్ములాని చేజిక్కించుకుంటారు!'' ఆల్జీబ్రా లెక్కకు ఈక్వేషన్ చెప్పినంత తేలికగా

స్కాట్ అన్నాడు.

షినాయ్ బెడ్ మీద ఎగిరి కూర్చున్నాడు. "ఏమిటీ! అయితే వాళ్ళు నామీద నిఘా వేశారంటావ్! నన్ను వెంటాడుతున్నారంటావా?"

"అని అనటంలేదు. అందుకు అవకాశం వుందని మాత్రమే నే చెప్పేది!"

"హమ్మయ్య! బ్రతికించావ్! నీ మాటలు విని నేను ప్రాణాలతో సింహాళం గడ్డమీద అడుగుపెట్టననే నమ్మేశాను."

"చైనానుంచి పారిపోయాక నీవు ఎలా జీవించావ్! ఈ ప్రయాణానికీ దానికీ నీకు డబ్బెక్కడిది?"

షినాయ్ ఒక నిముషం తటపటాయించాడు. "చెప్పాలంటావా?"

"తప్పదు మరి!"

"అయితే విను. హాంగ్ కాంగ్‌లో ఒక ప్రైవేట్ జారిణి ఇంటికి వెళ్ళాను. ఆమె ఏమరుపాటున వున్నప్పుడు ఆమె దగ్గర డబ్బు, నగలూ దొంగిలించాను. అంతకన్న గత్యంతరం లేకపోయింది మరి."

"ఆల్ రైట్! నీ కట్టుకథ గురించి మరోసారి తీరుబ్బాగా ఆలోచిస్తాను. వస్తాను!" అని స్కాట్ లేచాడు.

షినాయ్ గాభరాపడ్డాడు. "నన్ను ఒంటరిగా వదిలేసి పోతావా?"

"నీకా భయం అక్కరలేదు. బయట సెక్యూరిటీ గార్డు కాపలా ఉన్నాడు."

"ఈ నౌకలో పనివాళ్ళందరూ చాలమంది చైనీయులే! ఎవర్నీ నమ్మటానికి వీల్లేదు. ఆ సెక్యూరిటీ మనిషిగూడ చైనావాడు కాకుండా చూడు."

"కాదులే! అతడు చైనావాడు కాదు!"

తలుపు తెరవబోతున్న స్కాట్‌కి నేలమీద మడత పడిన కార్పెట్ క్రింద ఏదో కనిపించింది. నేలమీదకి వంగి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. అది చైనా నాణెం. చిల్లికానీ సైజులో ఉంది. అక్కడక్కడ చిలుంపట్టి, చాల పాతదని చెప్పక చెబుతోంది.

"ఈ నాణెం నీదా?" అని షినాయ్‌ని ఉద్దేశించి అడిగాడు స్కాట్.

"నాదికాదే!"

"ఇది చైనా నాణెంలా ఉంది. బహుశా నిన్ను పాడవటానికి వచ్చిన ఆగంతకుడిదై ఉంటుంది."

స్కాట్ ఆ నాణేన్ని జేబులో వేసుకున్నాడు. తలుపు లాగి బయటకు నడిచాడు.

గది బయట తుపాకీ పుచ్చుకుని అహమ్మద్ అనే బంగ్లాదేశ్‌కి చెందిన సెంట్రీ కాపలా ఉన్నాడు.

"అతగాడికెలా ఉంది సాబ్?" అని అడిగాడు స్కాట్‌ని.

"ఇప్పుడు నెమ్మదిగానే ఉంది! మధ్య మధ్యలో లోపలకు చూస్తుండు."

అహమ్మద్ గదిలోకి తొంగిచూశాడు. షినాయ్ పరుపు మీద అసహనంగా అటూ ఇటూ కదులుతున్నాడు. తలుపు లాగి మూసేశాడు మళ్ళీ.

మైకేల్ స్కాట్ తన గదిలోకి నడిచాడు. తలుపు లోపలి గడియ పెట్టుకుని వైర్‌లెస్‌లో మెస్సేజ్ పంపాడు తన రిపోర్టునంతా. సింహళ ప్రభుత్వ సర్వీసులో విజయా సేనానాయకే అనే సైంటిస్ట్‌ని జాగ్రత్తగా కాపాడాలనీ, ఆమెవద్ద ఒక ముఖ్యమయిన ఫార్ములా ఉందనీ చెప్పాడు.

మెస్సేజ్ పంపటం పూర్తిచేసి వేడినీళ్ళ స్నానంచేసి డ్రెస్ మార్చుకున్నాడు. నారాయణన్ టూత్‌పేస్టులో

బహుశా ఫార్ములా వివరాలూ, విజయా సేనానాయకే ఎడ్రసూ ఉండి ఉండాలనుకున్నాడు స్కాట్.

అతనికి మరో ముఖ్యమయిన వ్యక్తి చాంగ్‌ని ఇంత వరకూ కలుసుకోవటం పడలేదు. అతన్ని కలుసుకోవాలని స్కాట్ ఆత్రుతగా ఉన్నాడు.

# 9

తలుపు టకటకమని తట్టాడు స్కాట్. తలుపు తెరుచుకుంది. చాంగ్ నౌకరు తలుపు తెరిచి తల బయటకుపెట్టి చూశాడు.

"మీరేనా సార్! రండి! లోపలకు రండి!" అంటూ లోపలకు ఆహ్వానించాడు.

చాంగ్‌ది డబుల్ రూమ్. చాంగ్ డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని ఉన్నాడు. బల్లమీద పింగాణీ పాత్రల్లోని వేడి పదార్థాలమీదనుంచి ఆవిర్లు పైకి లేస్తున్నాయి.

స్కాట్ ఒక నిముషం తటపటాయించాడు. "మీరు కానివ్వండి. బ్రేక్ ఫాస్ట్ అయాక మళ్ళీ వస్తాను," అని వెనుదిరగబోయాడు.

"వెళ్ళకండి! మీకు ఆతిథ్యం ఇవ్వాలని నేను ఆతురతగా ఉన్నాను. నా ఆతిథ్యాన్ని స్వీకరించి నన్ను ధన్యుడ్ని చేయండి మిస్టర్ మైకేల్ స్కాట్!" చాంగ్ కుర్చీలోంచి లేచి ఆదరపూర్వకంగా కొద్దిగా ముంగుకు వంగి అభివాదం చేశాడు.

అతడి ఆహ్వానాన్ని స్కాట్ కాదనలేకపోయాడు.

నౌకరు మరో కుర్చీని తెచ్చి చాంగ్ కెదురుగా టేబుల్ దగ్గరగా వేశాడు. స్కాట్ కూర్చున్నాడు.

డైనింగ్ టేబుల్ మీదున్న పదార్థాలవంక చూశాడు స్కాట్. కోడుగుడ్లు, సీమపందిమాంసం, స్వీట్స్, రొట్టె, వెన్న, ముక్కుపుటాల్ని ఎగరేస్తున్న కాఫీ వాసన అతడ్ని

ఊరిస్తున్నాయి. అతడూ టిఫిన్ చేద్దామనుకుని చాంగ్ ని కలుసుకుందామనే తొందరలో మర్చిపోయాడు. చైనీయులు బియ్యం జావ, టీ తాగుతారు ఎక్కువగా. కానీ ఇతగాడు ఇంగ్లీషువాళ్ళ సాంప్రదాయంలో ఏవేవో ఆరగిస్తున్నాడే అని ఆశ్చర్యపోయాడు స్కాట్.

చాంగ్ మరీ మరీ బలవంతంచేసి కొసరి కొసరి తనే వడ్డించాడు. స్కాట్ తృప్తిగా ఆరగించాడు. కాఫీ త్రాగి ఇద్దరూ సిగరెట్ వెలిగించారు.

"నారాయణన్ హంతకుడి ఆనూకీ ఏమైనా తెలిసిందా?" చాంగ్ అడిగాడు నిదానంగా.

"లేదు. పైగా మరో హత్యా ప్రయత్నం జరిగింది?"

"నిజంగా! ఈ తడవ టార్గెట్ ఎవరో?"

"మీకు తెలీదా? షినాయ్ మీద హత్యా ప్రయత్నం జరిగింది?"

"అలాగా? నాకు తెలీదు ఇంతవరకూ! వివరాలు పూర్తిగా చెప్పండి!"

రాత్రి జరిగిన హత్యా ప్రయత్నం గురించి క్లుప్తంగా చెప్పాడు స్కాట్.

"అరె! ఎంత గొడవలు బయలుదేరాయి డెక్ మీద! వోడ చైనా తీరాన్ని వదిలేటప్పుడే నాకేదో అపశకునం గోచరించింది. దాని ఫలితం చూపెంచింది ముత్తానికి!"

మైకేల్ స్కాట్ తన జేబులోని చైనీ నాణేన్ని తీసి టేబుల్ మీద ఉంచాడు. "ఈ నాణెం చైనా దేశందేమో చూడండి!" అన్నాడు.

దాన్ని చూస్తూనే చాంగ్ ముఖంలో రంగులు మారాయి.

"ఇది మీ కెక్కడ దొరికింది మిస్టర్ స్కాట్?"

"షినాయ్ గదిలో పడివుంది. బహుశా అతడ్ని హత్య

చేయటానికి వచ్చిన ఆగంతకుని జేబులోంచి పడివుండాలి.”

చాంగ్ పేలవంగా నవ్వాడు. “పడివుండాలి అనేది సహజమైనది కాదు. కావాలనే ఈ నాణేన్ని అక్కడ పడేశారు ఎవరో!”

స్కాట్ ఆశ్చర్యంగా చాంగ్ వంక చూశాడు. “అందుకు కారణం ఏమై ఉంటుంది?”

“ఆ హత్యా నేరాన్ని నాకు ఆపాదించాలనే దురుద్దేశ్యంతో!” చాంగ్ నెమ్మదిగా పలికాడు.

స్కాట్ పెద్దగా నవ్వేశాడు. “అసంభవం. ఈ హత్యకి మీరు ప్రయత్నించారంటే నేను నమ్మను!” లైటు ఆరిపోయినపుడు చీకట్లో తను ఆగంతకుడితో ఢీకొన్నాడు. అతని ఎత్తూ, లావూ అన్నీ తనకు బాగా గమనం ఉంది. మరి చాంగ్ పిప్పిళ్ళ బస్తాలా ఉన్నాడు. ఈ విషయం దృష్టిలో ఉంచుకునే స్కాట్ పైమాటలు అన్నాడు.

“అంతేకాదు మిస్టర్ స్కాట్! ఈ నాణెం పడవేసిన చోటు ఇంకా హత్యలు జరుగుతాయనే హెచ్చరిక కూడా సూచిస్తోంది! అంటే వోడ తీరాన్ని చేరేలోపల ఇంకా దారుణహింసాకాండ జరగక తప్పదు!”

“ఎలా చెప్పగలుగుతున్నారు?”

“మీకు చైనా చరిత్ర అంత బాగా తెలీదల్లే ఉంది. పూర్వం ‘టాంగ్’ వంశీయులు చైనాని పరిపాలించారు. వాళ్ళ హయాంలో వాన్_టే అనే రాజకుమార్తె తన గోటితో మైనం పలకమీద ఈ నాణెం ఆకృతిని గీసింది. ఆమె హయాంలో చైనాదేశంలోని విదేశీయులందర్నీ బయటకు వెడలగొట్టారు. ఇప్పటికీ విదేశీయుల పొడగిట్టని చైనీయులు తమ ఉనికిని హెచ్చరించేందుకు ఈ నాణేల్ని ఉపయోగిస్తారు. వీళ్ళని మా పరిభాషలో ‘డ్రాగన్ మెన్’

అని అంటాం! అంటే 'భూతానికి బంట్లు' వీరు. వాళ్ళంటే నిజానికి మాకుగూడ వెన్నులోంచి భయం ప్రాకుతుంది."

"అయితే ఈ భూతాలబంట్లు ఎవరో షినాయ్ ప్రాణాలు తీయటానికి సన్నద్ధులైనారన్నమాట!"

"అనే అనుకోవాలి! నా గదిలో రివాల్వరు దొంగిలింపబడింది. దాంతోనే నారాయణన్ హత్యచేయబడింది. ఇప్పుడీ షైనా నాశనం! వీటన్నిటివల్ల తేలిందేమంటే ఆ హంతకులు అటు షినాయ్‌ని హత్యచేసి, ఆ హత్యానేరం నా మీదకు నెట్టాలని చూస్తున్నట్టుగా విశదమవుతోంది."

"ఆ రివాల్వరు మీదా?"

"మీ డిటెక్షన్‌లో ఆ విషయం పసిగట్టలేదా?"

"నేను డిటెక్టివ్‌ని కానండీ! కేవలం నారాయణన్ మీది సానుభూతితో ఏదైనా ఆచూకీ దొరుకుతుందేమో అని ప్రయత్నించాను. అంతే!" స్కాట్ నవ్వుతూ అన్నాడు.

"సారీ! ఏదో మాటవరసకన్నాను. సీరియస్‌గా తీసుకోకండి!"

"ఫర్వాలేదు! అయితే హంతకుడు నారాయణన్‌ని చంపడానికి మీ రివాల్వర్‌ని ఉపయోగించాడన్నమాట! మీ గదిలోంచి రివాల్వర్‌ని దొంగిలించటానికి అవకాశం ఎవరికి ఉందంటారు?

"నారాయణన్ హత్యకు ముందుగోజు కాబోలు, నా నౌకరు నా దృష్టికి తెచ్చాడు రివాల్వరు కనిపించటం లేదని! వాడేమో నేను లేనప్పుడు తన మేనల్లుడితో మాట్లాడి క్యాబిన్ రూమ్‌దాకా వాడ్ని సాగనంపానన్నాడు. బహుశా ఆ సమయంలో గదిలోకి ఎవరన్నా దూరి ఆ పనిచేసి ఉండాలంటాడు వాడు."

"మీ ఉద్దేశ్యంలో నారాయణన్ హత్యకూ, షినాయ్‌పై

దౌర్జన్యానికి ఏమైనా సంబంధం వుందా?" వాంగ్‌ని అడిగాడు స్కాట్.

"షినాయ్ గదిలోకి వచ్చిన వ్యక్తి దొంగతనం చేయటానికి వచ్చి ఉండచ్చు. కాని షినాయ్ మెలకువగా కదులుతూండడం చూసి పట్టుబడకుండా వుండేందుకు అతడితో తలపడి వుండవచ్చు. నారాయణన్ విషయం అలా కాదు. అది తప్పకుండా హత్యే! అది ముందరే జాగ్రత్తగా వేసుకున్న పథకం ప్రకారం జరిగి వుండాలి. నా రివాల్వరు మాయమయింది. దాన్ని చేతబుచ్చుకుని హంతకుడు అనితా గుణవర్ధనే గదిలో ప్రత్యక్షమయాడు. నారాయణన్‌ని పొట్టన పెట్టుకున్నాడు."

"ఒక వేళ ఆగంతకుడు అనితా గుణవర్ధనేని హత్య చేయాలనుకుని వచ్చాడేమో! తీం రంగంలోకి అనితాకి బదులుగా నారాయణన్ వచ్చాడు. తొందరలో అతడ్నే కాల్చేశాడు. అలా ఎందుకు కాగూడదు?" స్కాట్ అడిగాడు.

"హంతకుడు ఆ మాత్రం ఆడా, మగా తేడా తెలియకుండా కాలుస్తాడా? అతడు కావాలనే నారాయణన్‌ని కాల్చి చంపాడని నా అభిప్రాయం. అయితే నారాయణన్ అదే సమయానికి వస్తాడని హంతకుడికి ఎలా తెలుసు?"

"ఒక వేళ అనితా గుణవర్ధనేకూ మరో హంతకునికీ అంటే మీ దేశస్థుడికీ జాయింటుగా ప్రమేయం ఉండచ్చునా?"

"అసలు ఒక గంట క్రితంవరకూ నారాయణన్‌ని ఏ శ్వేతజాతీయుడో చంపి వుంటాడనే అభిప్రాయంలో వున్నాను. ఇప్పుడు మీ రీ నాణాన్ని చూపాక ఈ హత్యల వెనుక ఏ చైనా కళాసీ హస్తమో వుండి వుండాలని అనుమానించవలసి వస్తోంది," వాంగ్ గదిలోని

గుంద్రటి కన్నంలోంచి కనబడే సముద్ర జలాలవంక చూస్తూ అన్నాడు.

మైకేల్ స్కాట్ ఆతన్నే పరిశీలనగా చూశాడు. ఇతడ్ని చూస్తుంటే అతడు నిజంగా మనసు విప్పి మాట్లాడు తున్నట్టే తోస్తున్నది.

"మీ రివాల్వరు పోయిన సంగతి కెప్టెన్‌కి తెలియ జేయడం మంచిదనుకుంటాను. ఎందుకంటే వోడ సింహళం చేరంగానే పోలీసులు వస్తారు, హత్యగురించి దర్యాప్తు చేయటానికి! మీకు సింహళంలో ఎవరైనా తెలిసినవారు ఉన్నారా?"

"చైనా రాయబార కార్యాలయం నుంచి ప్రత్యేక అధికారి వస్తాడు నన్ను పోర్టులో రిసీవ్ చేసుకోవటానికి!"

"అలాగా! ఇదివర కెప్పుడైనా మీరు సింహళం వెళ్ళారా?"

"ఓ! లెక్కలేనన్నిసార్లు వెళ్ళాను. బంగ్లాదేశ్ నుంచి వస్తున్నారు కదూ మీరు? అక్కడ తెలిసిన వారెవ రున్నారు?"

"ఢాకాలో టీ కంపెనీల రిప్రజెంటేటివ్‌ని కలుసు కుని వస్తున్నాను."

"సింహళంలో ఎక్కడ మీరుండేది?"

"కాండీ!"

ఆ ఊరిపేరు వింటూనే చాంగ్ నొసట ముడుతలు పడ్డాయి.

"అక్కడ రాబర్ట్ సేనానాయకే అనే వ్యక్తి పేరు విన్నారా? అతడు నా బెస్ట్ ఫ్రెండ్!"

రాబర్ట్ సేనానాయకే భార్య పేరు విజయా సేనానాయకే. సైంటిస్టుగా పనిచేస్తోంది. షినాయ్ చెప్పే సమాచారాన్ని బట్టి ఫార్ములా ప్రస్తుతం ఆమె దగ్గరే వుండాలి.

"ఎవరూ? రాబర్ట్ సేనానాయకే! అతడు లాయర్ కదూ? కాని మనిషి చాలా నీచుడు. కాసు చూపిస్తే సరి ఏ పనికైనా సిద్ధమే! అతడు సంపాదించేది లేకపోగా భార్య జీతమంతా తన త్రాగుడుకే తగలేస్తాడు. అతడితో జాగ్రత్తగా మెలగాలి మీరు!"

"అతడితో నేను చాల జాగ్రత్తగా వుంటానులెండి! ఒకసారి డబ్బు అప్పు కావాలని వచ్చాడు. అడగ్గానే ఇచ్చి పంపాను. ఎందుకో తెలుసా? అతడా డబ్బు తిరిగి ఇవ్వడు. మళ్ళీ మన దగ్గరకు వచ్చి మరోమారు డబ్బు పుచ్చుకోడు!"

చాంగ్ పకపక నవ్వాడు. "భలే చతురులే మీరు!"

"వస్తానండీ! మీ ఆతిథ్యానికి చాల కృతజ్ఞుడ్ని!" అంటూ స్కాట్, కుర్చీలోంచి లేచాడు.

## 10

సిగరెట్ వెలిగించి క్యాబిన్ వేపుగా నడిచాడు స్కాట్. కెప్టెన్ ఇతర నావికులకు ఏవేవో ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు.

"కెప్టెన్ హెరాల్డ్! ఒక పెగ్ వేసుకుని వద్దాం రండి! మీతో అతిముఖ్యమయిన విషయం చెప్పాలి!"

"నా గదిలోకి వెళ్దాం రండి! డ్రింక్స్ కూడ ఉన్నాయక్కడే!" అంటూ కెప్టెన్ తన గదిలోకి దారితీశాడు.

మైకేల్ స్కాట్ తన జేబులోంచి చైనా నాణాన్ని తీసి చూపించాడు. చాంగ్ చెప్పిన విషయం చెప్పాడు, నాణెం ప్రాశస్త్యాన్ని గురించి.

"నా క్రింద పనిచేసే చైనా కళాసీల్లో ఒకడు ఈ పని చేసి వుంటారంటారా? నేను నమ్మలేను. నా వద్ద పనిచేసే వారంతా నమ్మకమైన వాళ్ళు, చైనావాడుగానీ బ్రిటిష్

వారుగానీయండి!''

"డ్రాగన్ మెన్ – భూతాలబంట్లు అనే పేరు ఎప్పు డన్నా విన్నారా?"

"విన్నాను. ఆ పేరు చైనా సంస్కృతికి ముడిపడి వుంది. వాళ్ళ పద్ధతులు కొంచెం హింసాయుతమైనవేకాని, వాళ్ళే నిజమైన దేశభక్తులంటాను. అయినా షినాయ్ పై చైనావారు ఎందుకు హత్యా ప్రయత్నం చేస్తారు?"

"అతడు చైనానుంచి పారిపోయి వస్తున్నాడని విన్నాను. అతడు తన గమ్యం చేరుకునే లోపల అతడ్ని కడతేరుస్తారేమో!"

"అయితే షినాయ్ బ్రతికి వున్నాడా? హరీ అన్నాడా?"

"ఇంకా బ్రతికే ఉన్నాడు. అతడు ప్రాణాలతో వుండేట్టుగా చూడవలసిన బాధ్యత మీది! వోడలో రెండో హత్యగూడ జరిగిందంటే ప్రయాణీకులు బెంబేలు పడి సముద్రంలోకి దూకేయగలరు కూడా?"

కెప్టెన్ తల నిమురుకున్నాడు. "అవును! అదీ నిజమే! హంతకుడెవరోగాని చాలా తెలివిగా మసలుకుంటున్నాడు. కాని నారాయణన్ హత్యకూ, షినాయ్ పై అత్యాచారా నికీ సంబంధం వుందని అనుకోను!"

"చాంగ్ గురించి మీ అభిప్రాయం ఏమిటి కెప్టెన్?"

కెప్టెన్ ఆదిరిపడ్డాడు. "చాంగ్ గురించేనా మీరడిగేది? అతడు లక్షాధికారి. ఇలాంటి బెధవ పనులు చేయాల్సిన అవసరం ఏముంది అతడికి?"

"చాంగ్ ని వ్యక్తిగతంగా మీరు బాగా ఎరుగుదురా?"

"ఆహాఁ! అతడు నా షిప్ లోనే ఎన్నోసార్లు ప్రయాణించాడు. అతడు చాలా మంచి మనిషి. ఎప్పుడూ నన్ను

తనగదికి ఆహ్వానిస్తుండేవాడు. కమ్మని టీతో సత్కరించే వాడు."

మైకేల్ స్కాట్ నవ్వాడు. "అతడు ఎల్లప్పుడూ తన భోజనానికి వరిజావ, అన్నమూ, కప్ప ఆవకాయ, స్ట్రాంగ్ టీ మాత్రమే సేవించేవాడు కదూ?"

కెప్టెన్ ఆశ్చర్యపోయాడు. "అరె! అంతా చూసినట్టు వర్ణించారే! లోగడ అతన్ని మీరు చూశారా?"

"లేదు! అసలు మన ఓడలో ప్రస్తుతం ప్రయాణించే వ్యక్తి చాంగ్ అవునా?"

"నీకు మరీ తాగుడు ఎక్కువ అయిందల్లే వుంది. ఇంకా సేపు ఆగితే నన్నే పిచ్చివాడిక్రింద జమకడతావ్! లేకపోతే ఏమిటి నీ ప్రశ్న. చాంగ్‌ని పట్టుకుని అతడు చాంగ్ అవునా, కాదా అని అడుగుతావేం?"

"మరి అతడు ఈ ట్రిప్‌లో మిమ్మల్ని ఒకసారన్నా టీకి పిలిచాడా?"

"అవును సుమా! నాకా ఆలోచనే రాలేదు! బహుశా అతడి ఆరోగ్యం సరిగా లేక పిలవలేదేమో!"

"ఆరోగ్యం సరిగా లేనివాడు అనితా గుణవర్ధనే, షినాయ్, డేవిడ్ స్మిత్‌ల్ని వెంటేసుకుని డెక్ మీద చిన్న పిల్లాడిలా ఆ పరుగులేమిటి?"

"అవునవును అదీ పాయింటే! అసలు చాంగ్‌ది ఎవరితోనూ కలిసే స్వభావంకాదు. మనిషి మితభాషికూడాను. ఆఁ! బహుశా అనితా గుణవర్ధనే స్నేహంకోసమేమో!"

"చూడండి కెప్టెన్! అనితా పెద్ద రంభేం కాదు. మామూలు ఆడదే! చాంగ్‌లాంటి లక్షాధికారి అలాంటి నాసిరకం ఆడవాళ్ళ వెంటబడుతున్నాడంటే నమ్మ లేకుండా వున్నాను."

కెప్టెన్ గది తలుపుమీద టకటక శబ్దం అయింది.

"యస్! కమిన్!" అని అన్నాడు కెప్టెన్.

తలుపు తెరుచుకుని ఓడ సరంగు లోపలకు వచ్చాడు. మైకేల్ స్కాట్ కుర్చీలోంచి లేచాడు.

# 11

విక్టోరియా నౌకలో సైరన్ మ్రోగింది. రేవు చేరువలోకి ఓడ వచ్చినట్టుగా అది ప్రయాణీకులకు హెచ్చరిక. ఓడ లోని ప్రయాణీకులు తమ లగేజీని సర్దుకుంటున్నారు. ఇన్నాళ్ళూ సముద్రపు గాలితో విసిగిపోయిన జనం ఎప్పుడు భూమిమీద అడుగుపెడతామా అని ఆతృతగా వున్నట్టుగా కనిపించారు.

కెప్టెన్ హడావిడిగా స్కాట్ గదిలోకి వచ్చాడు.

"మిస్టర్ స్కాట్! ఓడ రేవులోకి వెళ్ళంగానే సింహళ పోలీసులు వస్తారు నారాయణన్ హత్యగురించి ఆరా తీయటానికి. కాని అతడు జీవితంమీద విరక్తితో ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పాలి మీరు. ఎటూ హంతకుడు దొరకడు. నాకుమాత్రం ఇదో మాయని మచ్చగా మిగిలిపోతుంది! ఏమంటారు?"

"నా ఒక్కడితో చెబితే ఏం లాభం! అందరూ అలా చెప్పటానికి ఒప్పుకోవాలి గదా?"

"అందర్నీ ఒప్పించాను. చాంగ్, షినాయ్, డేవిడ్ స్మిత్, అనితా గుణవర్ధనే అందరితోనూ చెప్పి వారిని సమ్మతపరచాను."

"అందరూ ఒప్పుకుంటే నాకూ అభ్యంతరం లేదు."

"థాంక్యూ మిస్టర్ మైకేల్ స్కాట్!" కెప్టెన్ ముఖం వికసించింది. అతడు మరో గదిలోకి వెళ్ళాడు. బహుశా ఆ గదిలోని ప్రయాణీకుడ్ని కూడ ఒప్పించ టానికి అయి వుంటుంది అనుకున్నాడు స్కాట్.

ఓడ రేవు చేరింది. బెర్త్‌కి ప్రక్కగా ఆగింది. ఓడ

కిటికీలోంచి దూరంగా వున్న ఇళ్ళూ, మేడలూ బొమ్మరిళ్ళలా కనబడుతున్నయ్. ఈ రేవునుంచి విదేశాలకు టీ, రబ్బరూ, ఎక్కువగా ఎగుమతి అవుతవి. అందుకే రేవులో కోలాహలం విన్పిస్తోంది.

ప్రయాణీకులు దిగకముందే సింహళ పోలీసులు ఓడలోకి వచ్చారు. కెప్టెన్ జాన్ హెరాల్డ్ వాళ్ళని రిసీవ్ చేసుకున్నాడు. నారాయణన్ అనితా గురించి ప్రేమలో పడ్డాడనీ, ఆమె చాంగ్‌ని ప్రేమిస్తున్నదని తెలిసి ఆత్మహత్య చేసుకున్నాడనీ వివరంగా చెప్పాడు కెప్టెన్ వారితో.

"హత్య జరిగిన ప్రదేశానికి ముందుగా ఎవరు వెళ్ళారు?" పోలీస్ ఆఫీసర్ అడిగాడు.

"ముందుగా ఆ గదిలోకి వెళ్ళింది మైకేల్ స్కాట్!" అన్నారెవరో.

"అతణ్ని మేము ప్రశ్నించాల్సి వుంటుంది!"

పోలీస్ ఆఫీసరూ, పోలీసులూ, స్కాట్ ఒక గదిలోకి వెళ్ళారు. తలుపు లోపల గడియ పెట్టబడింది.

"భారతదేశంనుంచి మాకు మెస్సేజ్ వచ్చింది. మిమ్మల్ని కలుసుకుని మీకు అవసరమైన సహాయం చేయవలసిందని మాకు ఆర్డరు! మిమ్మల్ని కలవటం మాకు చాల ఆనందం కలిగిస్తోంది," అంటూ ఆఫీసరు స్కాట్‌తో కరచాలనం చేశాడు.

"మీతో అన్ని విషయాలూ చెప్పేందుకు వ్యవధిలేదు. మీ మనుషుల్ని నలుగురిని నాతో పంపండి! వారికి నలుగురు వ్యక్తుల్ని చూపుతాను. వారిని మీ మనుషులు వెంటాడి వారు ఎక్కడికి వెళ్ళేది, ఏంచేసేదీ కనిపెట్టాలి."

"ఓకే! అలానే!"

"ఈ పని చాల మెళకువగా చేయాలి. ఆ వ్యక్తులు

నలుగురూ నక్కజిత్తుల వాళ్ళు. తమను 'ఫాలో' అవుతున్నట్టుగా వారికేమాత్రం అనుమానం కలగకూడదు! నేను కస్టమ్స్ చెకింగ్ దగ్గర నిలబడి వుంటాను. మీరు వెంటాడవలసిన మనిషి నా దగ్గరకు రాగానే వాళ్ళని మాటల్లోకి దించి, నేను తల గోక్కుంటాను. అదే మీకు సంకేతం! ఆ మనిషిని మీరు 'ఫాలో' అవాలి! అర్థమయిందా నేను చెప్పింది!" స్కాట్ చెప్పిన మాటలకు వాళ్ళు తలకాయలు ఊపారు.

గది తలుపు తెరుచుకుంది. కెప్టెన్ హెరాల్డ్ గది బయట ఆత్రంగా వేచి వున్నాడు.

"అతడు యిచ్చిన సమాచారాన్నిబట్టి నారాయణన్ ఆత్మహత్య చేసుకున్నాడని రూఢి అయింది కెప్టెన్!" అన్నాడు పోలీసాఫీసరు నవ్వుతూ.

"థాంక్యూ ఇన్స్పెక్టర్!" అని కెప్టెన్ ప్రయాణీకులు దిగటానికి అనుమతి ఇచ్చాడు.

చెక్కల మీదగా ప్రయాణీకులు అడుగులువేసి ప్లాట్ ఫారమ్ మీదకు దిగుతున్నారు.

ఇన్స్పెక్టర్ ప్రక్కగా నడుస్తున్నాడు స్కాట్.

"విజయా సేనానాయకే ఆచూకీ ఏమైనా తెలిసిందా?"

"లేదండీ! అదో పెద్ద మిస్టరీలాగ తయారయింది. ఆమె భర్తగాడ హత్యచేయబడ్డాడు. వాళ్ళ నౌకరు బజారుకు వెళ్ళి వస్తుంటే అతడివీపుగా గుర్తుకొరకని లాకి వెళ్ళింది. అతడూ చనిపోయాడు."

"గుడ్ గాడ్!" అన్నాడు స్కాట్. ఆమె శత్రువుల్లో చేరిపోయి వుంటే ఈ ప్రపంచాన్ని చైనావారి చేతుల్లోంచి భగవంతుడు కూడా రక్షించలేడు. అలా కాక ఆమె ప్రాణాలతో ఎక్కడన్నా నిర్బంధంలో గనుక వుండి వుంటే...

"మీరు 'ఫాలో' అవమన్న వ్యక్తులు ఎవరెవరు?" పోలీసు ఆఫీసరు అడిగాడు మళ్ళీ.

"అనితా గుణవర్ధనే అనే ఒక స్త్రీ, డేవిడ్ స్మిత్, షినాయ్, మరియూ చాంగ్-ఫూ-చాంగ్!"

"చాంగ్ అంటే ఆ లక్షాధికారేనా?"

"అవును!"

"అతడికి ఈ దేశంలో మంచి పేరుంది! పైగా ఇక్కడ చైనీయుల్ని ఏమన్నా అంటే చాలు బాబోయ్! మమ్మల్ని ప్రభుత్వాధికారులు కాల్చుకు తింటున్నారని గగ్గోలు పెట్టేస్తారు!"

"అరెస్టు చేయబోవటం లేదుగదా మీరు! కేవలం ఫాలో అవటం వరకే! అతడు నేరస్థుడని ఋజువు దొరికితేనే అతడిమీద మీ చేయిపడేది!"

"ఓకే! అలాగే సార్!"

# 12

పోలీస్ హెడ్ క్వార్టర్స్‌లో తన ఐడెంటిటీని చూపాడు మైకేల్ స్కాట్ ఉరఫ్ నరేంద్రకుమార్. తను షినాయ్ ద్వారా సేకరించిన సమాచారాన్ని ఇన్స్పెక్టర్ జనరల్‌కి తెలియజేశాడు. అతడు చెప్పేదాన్ని ఆలకిస్తున్న వారందరి ముఖాల్లో భయం ద్యోతకమవుతున్నది.

స్కాట్ నలుగురు వ్యక్తులను చూపించి వారిని వెంటాడమన్నాడు. ఆ నలుగురులో డేవిడ్ స్మిత్, అనితా గుణవర్ధనే ఇద్దరూ కలిసే వెళ్ళారు.

వాళ్ళిద్దరూ తమ స్నేహితుడైన ఒక డాక్టరు ఇంటికి వెళ్ళినట్టుగా చెప్పారు తిరిగివచ్చిన పోలీసు సి. ఐ. డీలు.

షినాయ్ ఓడనుంచే బయటకు రాలేదు లెక్క ప్రకారం. ఇక నాలుగో వ్యక్తి చాంగ్. అతడు తనను వెంబడిస్తున్న వ్యక్తికి బురిడీ ఇచ్చి తప్పుకుపోయాడట.

తెల్లారేలోగా చాంగ్ ని పట్టుకోకపోతే కొద్దిరోజుల్లో ప్రపంచ మనుగడకే ముప్పు వాటిల్లగలదని హెచ్చరించాడు స్కాట్. అవసరమైతే మిలటరీ సహాయంగూడ తీసుకుని కాండీ నగరం అంతా ప్రతి అడుగూ వెదికి చాంగ్ ని పట్టుకోవాలని కోరాడు.

డేవిడ్ స్మిత్ ని వెంటాడిన పోలీసుని వెంటపెట్టుకుని నరేంద్రకుమార్ బయలుదేరాడు స్కూటర్ మీద.

కాండీ అనే నగరంలో ఒక చైనాదేశపు డెంటిస్ట్ ఇంటిముందు ఆగారు. అది పాత ఇల్లు. లోపల లైటు వెలుగుతున్నది. ఇంటికి బయట తాళం వేయబడి ఉంది.

పోలీస్ సి. ఐ. డి. తన జేబులోంచి తాళాలగుత్తిని తీశాడు. రెండు తాళం చెవుల్ని మార్చిచూసిన తర్వాత తాళం ఊడింది.

ఇద్దరూ నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ లోపలకు నడిచారు. హాలు దాటుకుని వెనుకవేపుగా వున్న గది వైపుగా అడుగులు వేశారు. ఆ గదిలోనే లైటు వెలుగుతోంది. నరేంద్రకుమార్ చెయ్యి జేబులో వున్న రివాల్వరు మీదే వుంది.

గదిలో బహుశా డెంటిస్ట్ కాబోలు, అతను డ్రాయరు లాగి అందులోని కాగితాల్ని మరో బ్రీఫ్ కేసులో సర్దుతున్నాడు.

"చేతులు పైకెత్తి అలాగే నిలబడు డాక్టర్!" అన్నాడు నరేంద్రకుమార్ రివాల్వర్ ని అతనికి గురిపెట్టి.

అతడు అదిరిపడ్డాడు. "నేను... నేను ఎక్కడికీ పోవటంలేదు" అన్నాడు తడబడుతూ.

పోలీస్ సి. ఐ. డీ అతడివద్దకు వెళ్ళి జేబులు సోదా చేసాడు. అతడి జేబులో ఆయుధాలు ఏమీ లేవు.

"డాక్టర్! మా కాలాన్ని వృధా చేయకుండా త్వరగా

చెప్పు డేవిడ్ స్మిత్ ఎక్కడ?"

"ఇంతకీ మీరెవరు? మీకేం కావాలి?"

"నీకు తెలిసిన సమాచారం అంతా కావాలి!"

"మీకు కావలసిన సమాచారం ఏమిటో నాకే తెలియదు ఇంక మీకు చెప్పేదెలాగ?"

"విజయా సేనానాయకే ఎక్కడ? అనితా గుణవర్ధనే ఏదీ? డేవిడ్ స్మిత్ ఎక్కడకు వెళ్ళాడు?

"ఆ పేరుగల మనుషు లెవరూ నాకు తెలీదు! నా ఇంట్లోకే దూరి ఏమిటీ దౌర్జన్యం!"

పోలీస్ సి. ఐ. డి. పిడికిలి బిగించి డాక్టర్ గడ్డం క్రింద గుద్దాడు బలంగా.

"అమ్మో! కొట్టకండి! నిజం చెబుతాను!" అన్నాడు డాక్టర్.

"విజయా సేనానాయకే చనిపోయింది! ఫార్ములాకోసం వాళ్ళే ఆమెను చంపారు!"

"ఆమెని నీవే ఇక్కడకు తీసుకువచ్చావు కదూ మోసం చేసి!" స్కాట్ కోపంగా అడిగాడు.

"నేను మోసం చేయలేదు. వాడే! డేవిడ్ స్మిత్ చెప్పాడు ఆమెను ఇక్కడకు తీసుకొచ్చి వుంచమని! అలా చేస్తే చాలా ధనం వస్తుందన్నాడు" మరేదో చెప్ప బోయిన డాక్టర్ కళ్ళు కొత్తకాంతితో వెలిగాయి.

దానికి కారణం పసిగట్టే లోపలే పోలీసు సి. ఐ. డి. అరిచాడు "క్రింద పడిపో స్కాట్!"

స్కాట్ నిలుచున్న పళంగా క్రింద పడిపోయాడు. తల ప్రక్కకు త్రిప్పి చూశాడు.

డేవిడ్ స్మిత్, అనితా గుణవర్ధనే వాకిట్లో నిలబడి వున్నారు. స్మిత్ చేతులో రివాల్వరు ప్రేలింది. స్కాట్ కని ఉద్దేశించిన బుల్లెట్ వెళ్ళి డాక్టర్ కి తగిలింది, స్కాట్

నేలబారుగా పడిపోవటంతో.

స్కాట్ తన జేబులోంచి పిస్టల్ తీసి కాల్చాడు. స్మిత్ చేతిలోని పిస్టల్ జారి క్రిందబడింది. అతడి రెండు చేతులూ బుల్లెట్ దూరిన ప్రదేశంలో అదిమినయ్. మరు క్షణంలో అతడూ నేల వాలిపోయాడు.

# 13

"అనితా గుణవర్ధనే! ఎలువంటి పిచ్చివేషాలూ వేయకుండా నిజం చెప్పు! నారాయణన్‌ని చంపటానికి నీవు స్మిత్‌కి సాయపడ్డావు కదూ?"

"లేదు! నాకేం తెలీదు!" అనితా తన ముఖాన్ని చేతుల్లో కప్పుకుంటూ అంది.

"నీ కన్నీళ్ళు నన్ను కరిగించలేవు. నా చేతిలో చావక ముందే నిజాన్ని వెల్లడించు!" స్కాట్ గద్దించాడు.

"నిజమే! డేవిడ్ స్మిత్ చంపాడు నారాయణన్‌ని. అందుకు నేనూ సాయపడ్డాను. అతడ్ని అంతం చేయకపోతే అతడే మమ్మల్ని జైలుకు పంపుతాడని నన్ను భయపెట్టాడు స్మిత్. అందుకే ఒప్పుకున్నాను."

"అసలు నీవెవరు? ఈ ముఠాలోకి ఎలా వచ్చావ్?"

"నేను హాంగ్‌కాంగ్‌లో ఒక పెద్ద హోటల్లో కాల్ గరల్‌గా పనిచేస్తున్నాను. ఆడదానికి వయసు పెరిగేకొద్దీ వన్నె తగ్గుతుంది. వన్నె తగ్గేకొద్దీ సంపాదనా పడిపోతుంది. నేను సరిగ్గా ఆ ప్రమాదంలోనే వున్నాను. డేవిడ్ స్మిత్ నన్ను ఊరించాడు. డబ్బు సంపాదించుకోవటానికి సులువైన మార్గం చెబుతానన్నాడు. తనకు సాయంగా సిలోన్ దాకా రమ్మన్నాడు. నేను ప్రయాణమై వచ్చేశాను. తను చైనావారికింద పనిచేస్తున్నానని చెప్పాడు. ఓడలో నారాయణన్ తనవెంట బడకుండా చూడడమే నా పని, అందుకే అతడ్ని నా వలలో వేసుకున్నాను."

స్కాట్ పోలీసు సి. ఐ. డికి సంజ్ఞ చేశాడు అనితాను కనిపెట్టమని. తను డేవిడ్ స్మిత్ శవంమీదకు వంగి అతడి జేబులు సోదా చేశాడు ఫార్ములా ఉందేమో అని. కాని ఏవో కరెన్సీనోట్లు తప్ప మరేమీ లేవు. హోటల్ ఇంపీరియల్‌లో ఎనభై నాలుగో నెంబరు గదికి తాళంచెవి దొరికింది.

"నీ గది తాళంకూడా ఇవ్వు!" అనితా గుణవర్ధనే వంక చూస్తూ అడిగాడు స్కాట్.

గొణుక్కుంటూ తన వానిటీ బ్యాగ్ అందించింది. దాంట్లోని తాళంచెవిని తీసి పోలీసు సి. ఐ. డికి అందించాడు.

"హోటల్ ఇంపీరియల్‌కి వెళ్ళు. వాళ్ళ గదులు రెండూ సోదా చేయి! ఫార్ములా కాగితాలు దొరికితే నేరుగా పోలీస్ హెడ్‌క్వార్టర్స్‌లో అందించి మరీ, నా దగ్గరకు తిరిగి రా!"

పోలీస్ సి. ఐ. డి. వెళ్ళిపోయాడు. స్కాట్ రివాల్వర్‌ని చేతిలో ఉంచుకునే అనితా చేత డాక్టర్ సర్దుతున్న బ్రీఫ్‌కేస్‌ని తెప్పించాడు.

"రివాల్వర్ పేలిన చప్పుడుకు పోలీసులు వచ్చినా రావచ్చు!" అంది అనితా గుణవర్ధనే. విక్టోరియా నౌక మీద తనుచూసిన మాత్రం అందంగూడ లేదు ఇప్పుడామెలో. ఎన్నో సంవత్సరాలు పైబడ్డ వృద్ధ వనితలా కనుపించింది.

అనితా బ్రీఫ్‌కేస్ వంకే చూస్తూన్నది. "నీవు వెళ్ళే చోట అంతా పోలీసులమయమే!" అన్నాడు స్కాట్ సూటీపోటీగా. అంటే ఆమె పోలీస్ స్టేషన్ లాకప్‌లోకి త్వరలో వెళ్ళబోతోందని అతడి భావం.

"హోటల్ ఇంపీరియల్ నుంచి స్మిత్ వెంట మళ్ళీ

